# పరిచయము

ఇది యంత్రయుగము. యంత్రములు పాలించుకాలము. బొగ్గుయంత్రములు, ఆవిరియంత్రములు, నూనెయంత్రములు, విద్యుద్యంత్రములు, గాలియంత్రములు ఆరాధింపబడుకాలము. వస్త్రములు, అన్నపానీయములు, గృహములు, బండ్లు, ఓడలు, విమానములు యంత్రములతోనే తయారుచేయుకాలము. వింతలు, వినోదములు, నడకలు, పరుగులు, నిత్యకృత్యములు చదువుసంధ్యలు—సమస్తము యంత్రసహాయముతో, యంత్ర పరికరములతో యంత్రవతుగ నడుపబడుచున్నవి. పెక్కు యంత్రములుగల దేశములు యంత్రహీనములైన దేశములపై రాజ్యముచేయుచున్నవి. స్వారిచేయుచున్నవి. నేటి పరిశ్రమ లన్నియు యంత్రములచేతనే నడుపబడుచున్నవి. యంత్రపరి శ్రమలు చేతిపరిశ్రమలను నాశనముచేసినవి.

యంత్రములు ప్రకృతిసీమలనే దగ్గరకుతెచ్చి తత్పూర్వపుపరిశ్రమలను, ఆర్థికములను తారుమారుచేసినవి. మానవ శక్తులను తబ్బిబ్బుచేసినవి. ప్రకృతిస్వావమే మారిపోయెను. పూర్వపువిలువలు పోయి నూతనవిలువలు సృష్టింపబడినవి. యంత్రముచేయజాలని దేదియు లేనట్లు నేటి ప్రపంచము నడచు చున్నది. యంత్రమహిమను గుర్తింపలేనినరుడు నేడు వ్యర్థజీవి యగుచున్నాడు. ఏ యంత్రమునకైనను దానికితగిన విలువ నీయక తప్పదు. అగుగాక. కాని యీ గడబిడజీవితములో,

నీ పరుగులహడావుడిలో, నీ విషయవిప్లవములో, ప్రకృతిని జయింపవలెననెడి యాందోళనలో, సుఖావభృతమునకు బాహ్య ముగ జరుగుచున్న యీ పందెములో 'అసలుయంత్రము' సంగతి విస్మరింపబడుచున్నది. సామాన్యము, అసామాన్యము, నీవు, నేను, అందరము-తలచినంతమాత్రముచే దేనినైనను సాధింపగల సూక్ష్మాతిసూక్ష్మమైన యంత్రము-ఊహకూర, యిం టింటగల యంత్రము-ఏదిలేనిచో పైన వివరింపబడిన భౌతిక యంత్రములు, లోహయంత్రములు తోయహీనమైన నదివంటివి వగునో యట్టి - మానవయంత్రమును - మరచి మరుమరీచికల వెంటబడుట శోచనీయము.

కనుక నీ వ్యాసములలో స్థాలీపులాకన్యాయముగ మానవయంత్రమును చర్చింపగోరెదను. ఇది కేవల మొక ప్రాథ మిక చర్చ.

ఇందులో నపూర్వవిషయములు, నూతనసృష్టి, యను భవముకందని విషయములు, సర్వులకు తెలియని సంగతుల నుండవు. ప్రతివ్యక్తికి నుపకరించునవి, వ్యక్తిని శక్తివంతుని చేయునవి, మనలను నిత్యము ప్రేరేపించుచు చిన్నవైనను పె విషయములకు ప్రాతిపదికలగు సామాన్యవిషయములనుగురిం వ్రాయుటయే నా యాశయము. ఈ రంగములో నిది కేవలమ ప్రాథమికగ్రంథము. ఇది రే కొద్దిమందికుపకరించినను ధన్యుడను.

ముదిగంటి జగ్గన్నశాస్త్రి

# మానవయంత్రము

పరిచయవాక్యములలో యంత్రశక్తిని గురించి కొంత వినియుంటిమి. సమస్తము యంత్రమువలనను, యంత్రమువలెను తిరుగవలెననియు, తిరుగుచున్నదనియు చూచియుంటిమి.

మానవుడుకూడ నొక 'వింత'యంత్రము, అన్ని యంత్రములవలె నిదియు పనిచేయుచుండవలెను. లేనిచో దీనికి 'తుప్పు' పట్టును. ఎదుగు బొదుగులు లేకుండపోవును. బొగ్గు, నీరు, గాలి దీనికిని కావలయును. పని, విశ్రాంతి, జీవితప్రమాణము సామాన్యముగ దీనికిని కలవు. కాని యీ సామాన్య లక్షణములను దాటి మానవయంత్ర మింకను పోగలుగుటలోనే దాని విశిష్టత యున్నది. కనుక నిది యన్నియంత్రములవంటిదికాదు. దీని నిర్వాచన మింకొక తరహాకు చెందును.

ఈ యంత్రము పైకి కాన్పించు స్థూలశరీరమేకాదు. ఇది యీ స్థూలశరీరయంత్రమును నడిపించు శక్తికూడ దీనిలోనే యమర్చబడిన 'వింత'యంత్రము. అరిగినిరిగిపోవు యంత్రములో నరుగక విరుగక శాశ్వతముగనుండు తత్త్వముగల 'చమత్కార' యంత్రము. పొడుగు, పొట్టి, బరువు, తేలిక, లావు, పలచన, మెరుపు నలుపు తెలుపు అను విశేషములతో బంధింపబడని యంత్రము. చివర కిది యెవ్వ డెచ్చట నెవరిచే యెందునిమిత్తము సృజింపబడినదో గుర్తింపనలవికాని 'చిత్ర' యంత్రము. కనపడి నను కనుపించని విచిత్రయంత్రము. 'అవాస్తవిక' వాస్తవిక

యంత్రము. మనకుకనిపించు ప్రతియంత్రమునకు నొక కర్త కలదు. దానిని నడుపువాడింకొకడు కలడు. దాని నడకకు, శక్తి సామర్ధ్యములకు, దానిద్వారా జరుగుపనికి నొక మితి హద్దుపద్దులు, లెక్క,జీవితప్రమాణముకూడ కలవు. దానంతటది నడువజాలదు, పనిచేయజాలదు. ఆలోచింపజాలదు. దానిని కదుపుటకు, నడుపుటకు పరహస్తము కావలెను.

ఇక మానవయంత్రము విపరీతయంత్రము. దీనికిని పని, విశ్రాంతి, జీవితప్రమాణము, బొగ్గు, నిప్పు, నీరు, గాలి, కిరకిరలు, చిరచిరలు, వయోభేదము, చివరకు జీర్ణావస్థ కలవని మనము తెలిసికొంటిమి. ఇది మనందరి యనుభవమే. కాని యిది యంత్రములో యంత్రముకల ద్వంద్వయంత్రము. ఇతర యంత్రములకు దీనికి సామాన్యావస్థలు, పోలికలు, ధర్మములు నెన్నియున్నను వీటినిమించి, ధిక్కరించి, ప్రమాణములను, వర్ణనలను అతిక్రమించి పనిచేయగల 'వస్తువిం'కొకటి యిందులో కలదు. ఇతర యంత్రములవలె కాక దీని నదియే సృష్టించుకొని నడుపుకొనుచున్నది. కనుకనే యొక మానవయంత్రమునకు మరియొక మానవయంత్రమునకు పోలికలతోపాటు వ్యత్యాసమెంతేని కలదు.

యంత్రము విశ్రాంతిలో నుండగా పనిచేయుట యనునది యుండదు. మానవయంత్ర మట్లుకాదు. నిద్రించుచున్నను మానవునిలో పనిచేయుతత్త్వము, శక్తి, తెలివి యొకటి కలదు. లేదందుమా దానికి మృతియే సంభవింపవలెను. నిద్రించుచున్నపుడు మానవుడు చచ్చిపోవుటలేదని మనమందరము నంగీకరింతుముకదా !

ఈ స్థూలయంత్రము విశ్రాంతిలో నున్నను, జీర్ణమైనను జీర్ణముకాని శక్తి యొకటి యిందులో కలదు. దీనికే మనస్సు, బుద్ధి, తెలివి, జీవుడు, చైతన్యము, ఆత్మ, బ్రహ్మము, మొదలగు పేరు లనేకములు భాష పోవువరకు కల్పింపబడి యంతటితో ఆగిపోవుచున్నవి. ఇంకను పైకెగురగలశక్తిలేక భాష యంతటితో విరామము చెప్పకొనుచున్నది.

కనుక నీ యంత్రము నిక మనము విశేషించి తడవు ట ప్రస్తుతము. ఇది స్వయంనిర్మితము, స్వయంచోదితము నని చెప్పటయే ప్రస్తుతాంశమునకు తగియుండును.

ఎముకలగూడు, మాంసపుముద్ద, రక్తనాళములు, మజ్జా శుక్లములు, నాడీమండలము, చర్మకవచము మనకు కాన్పించు మానవుని బాహ్యాకారములు. ఇంతమాత్రపు నిర్వచనముచే మానవుడు మానవుడగుటలేదు. ఇవి పశువులకును కలవు. ఆలోచన, కోరిక, ఊహ, బుద్ధి, రాగద్వేషములు - ఇత్యాది కంటికి కాన్పించని తత్త్వమొకటి ప్రవేశించుటచేతనే మానవునకు తదితరలోకమునకు, నితర ప్రాణికోటికి నెంతేని భేద మేర్పడుచున్నది. ఇది లేనంతవరకు నుభయశాస్త్రములకు సామ్యత, యేకవాక్యత యుండును. మనశ్శక్తితో మానవునకు విశేషత యేర్పడుచున్నది. మనస్సును దాటిన స్థితికూడ మానవుడనుభవింపగలుగుచున్నాడని మహాత్ములజీవితములు విదితము చేయుచున్నవి. కనుక మానవశాస్త్రము తక్కిన పదార్థశాస్త్రములకంటె జంతుశాస్త్రములకంటె నుత్కృష్టమైనది. ఈ మనోమణిచే మానవున కొక నూతన రాజ్యమే ప్రాప్తించుచున్నది. తిలలో తైలమున్నట్లు, నిప్పులో దాహశక్తియున్నట్లు, నీటిలో

శైత్యమున్నట్లు నీలో నంతర్గర్భితముగనున్న యీ మణిని త్రివ్వి కొని యనుభవించుటే నీ పని. ఇదియే నీ జీవితప్రయోజనము. మనస్సును, మనస్సుపై దానిని నీ వొప్పుకొనక తప్పదు.

ఇది లేనిదానికొరకు కానిదానికొరకు పరుగులిడుట కాదు. ఇది యున్నదానిని, అయినదానిని తెలిసికొనుట, కను గొనుట, అనుభవించుట, యుపయోగించుకొనుట. దీనిని విస్మ రించువాడొక యసామాన్య రాజ్యమును పోగొట్టుకొను చున్నాడు. మేరలులేని యీ మనోరాజ్యమును పోగొట్టుకొనిన మానవుడు మానవేతరలోకమునకు ననగా పశులోక ఖనిజ లోకములకు దిగజారిపోవుచున్నాడు.

ఈ సృష్టిరహస్యమును, ప్రకృతిసంపదను తన నిజాభి వృద్ధిని గుర్తించి, గ్రహించి, సమన్వయపరచి యుత్తుంగ భావ తరంగ శిఖరాగ్రముల నానందైకరసానుభూతినొందుటయే మానవలక్ష్యము, మానవపరమాశయము.

ఈ సిద్ధి కలుగువరకు మానవయంత్రము తృప్తి పొంద జాలదు. అది రూపాంతరముల నొందుచు నెన్నియైశ్వర్యము లనుభవించినను నది సాగరతరంగకేళిలో లీనమగువరకు సాగిపోవు నట్లు 'జీవి' యమరత్వమునొందువరకు ప్రయాణించుచుండును.

కనుకనే 'మానవుడింతవరకే పోగలడు. అతడిక ముందుకు పోజాలడు' అను హద్దు లెచ్చటను లేవు. అతని హద్దుల నతడే కల్పించుకొనుచున్నాడు. పుట్టుట, పెరుగుట, నశించుట శరీర లక్షణములు. అవధిలేకుండ పెరుగుచుండుట, అఖండత్వములో కలసిపోవువరకు వృద్ధియగుచుండుట మానసలక్షణము. అదియే మానవత్వసిద్ధి, మానవపరమావధి.

'ప్రతిమానవుడు మూర్ఖపాత్రి వహించుచున్న దైవమే' యని యాంగ్లకవిసార్వభౌముడు షేక్స్పియరు చాటినాడు. దీనినే మన సద్గ్రంథములును ఘోషించుచున్నవి. ఇది యొక గొప్ప సత్యము. పైన మూర్ఖత్వము, లోపల దివ్యత్వము. ఈ పైపొర పీడిననాడు దివ్యత్వమే ప్రకాశించును. దివ్యత్వమే దీనిస్థిరలక్షణము. మూర్ఖత్వము లేక నజ్ఞానము మనము తెచ్చి పెట్టుకొనిన వికారగుణము. కనుక మానవుడా లెమ్ము! లేచి నీ యావరణలను చీల్చి నీ నిజవీర్యమును కొంతకు కొంత యైనను ప్రకాశింపనిమ్ము.

# మానవకీటకము

జీవము కలది, జీవించు సమస్తము జీవకోటి యనబడు చున్నది. చీమ దోమ మొదలు మానవునివరకు ప్రాణముకలవి జంతువు లనబడుచున్నవి. దోమకంటె నికృష్టమైనది జీవము మాత్రమే కలది రెండవది యనగా స్త్రీలేకనే తనకు తానే పుట్టుచు, తనంతతానే యనేకమగుచు తనకు తానే క్రీడించుచు నితరసంబంధము, సాంగత్యము, సంపర్కము నెంతమాత్రము లేక జీవించు "అమీబా"యను నొక క్రిమి గలదు. ఇదియొక అణుక్రిమి; అణుజీవి. తనంతటతానే యనేక మగుచుండు జీవి.

ప్లావిలాకు అను నాకువలె నిది తనంతటతానే యనేక మగుచుండును. నిజమున కిదికూడ నొక ప్రాణియే. జీవమే. ఇది తన గుడికట్టులోనే జీవించు సంకుచితప్రాణి. కాని దీనిని

'జీవము', దీనిది 'జీవితము' అని యనుటకంటె 'నుండునది', 'ఉండుట' యను మాటలే దీనికి తగినవి. ఇవియే దీనికి తగిన నిర్వాచనములు. ఉండుటయే యీ 'జీవి' పరమావధి.

ఈ యణుక్రిమివలె, పురుగువలె మానవుడు తనయునికి మాత్రముచేతనే, స్పందనము, కరచరణాదిచాలనముమాత్రము చేతనే వృద్ధిచెందజాలడు. 'ఉండుట' మాత్రముచేతనే మానవ జీవితము వృద్ధియగుటలేదు. అది యట్లు వృద్ధికాజాలదు. 'ఉన్నాడు, ఉండెడివాడు. పుట్టెను, చచ్చెను' అనిపించు కొనుటకంటె విశేషముకలజీవియే మానవుడు. మానవజీవితము బహుముఖమగు నభివృద్ధిని, పూర్ణరూపమును పొందవలయును. క్రూరజంతువులు, ఘాతుకజంతువులు తమమట్టుకు తామే జీవించును. అవి రెండవదానితో జీవింపవు. పైగా వాటిని చంపివేయు ఘాతుకస్వభావము తప్ప మరియొక స్వభావము నెరుగవు.

మానవుడో! అతడు సంఘములో జీవించు సాంఘిక జీవి. కలియుట, విడిపోవుట, యిచ్చుట, పుచ్చుకొనుట, నేర్పుట నేర్చుకొనుట, చదువుట, చదివించుట, వినుట, వినిపించుట, తినుట, తినిపించుట, అనుకరించుట, యభ్యసించుట- మొదలగు వివిధక్రియలతోను, భావములతోను గాని మానవజీవితము వికసింపజాలదు. అతని మానసిక యాధ్యాత్మికగుణము వికసింపనిచో స్తంభించిపోవును.

మానవుడనగ మనస్సు లేక దానికంటె పైది యను నర్థముకూడ స్ఫురింపక తప్పదని యిదివరకే గ్రహించితిమిక దా. అట్టి వికాసమెద్దియు లేక నుచ్ఛ్వాసనిశ్వాసమాత్రుడగువాడు

'అమీబా' మానవుడు. అనగా క్రిమివలె పుట్టి క్రిమివలే నశించే మొందుజాతికి చెందువాడు.

రక్తపుముద్ద, మాంసము, ఎముకలగూడు, కండరములు కూడినంతమాత్రముచేత మానవత్వము ప్రాప్తించుట లేదని చూచితిమికదా! కనుక మానవత్వమనగా వీటిచే బాధింపబడక, వీటిలోపల నివసించుచు, వీటిపై తన ప్రభావమును ప్రదర్శించుచు, వీటికి స్థితి నిచ్చుచు వీటిలోనున్నను నెట్టి మలినము పొందక ప్రకాశించు నొకశక్తి, చైతన్యము, జ్యోతియని తేలినది!

తమకొరకే జీవించుచు, నితరులకీయక, నితరులనుండి గ్రహింపక, పరస్పరతలేక నొంటరిగా జీవించు మానవులు లేకపోలేదు, వారు స్వార్థజీవులు. వారి వ్యక్తిత్వము స్వార్థమయము. ఇచ్చట వికాసమునకు తావులేదు. హృదయమునకు, మనస్సుకు స్థానములేదు, జంతువులకున్నట్లు వైద్యులు కోసి ప్రదర్శించుటకు తగిన శిరలసంపుటివలన మానవత్వము కలుగుటలేదు. అది కేవలము చీకటికొట్టు. తేళ్ళకు, జెర్రెలకు అనువగు స్థానము. ఈ చీకటికొట్టులో మానవత్వము శోషించి పోవుచున్నది. ఇట్టి జీవితము 'మూక' జీవితము. క్రిమిజీవితము. దివాంధజీవితము.

పరులతో వర్తించుట, సహించుట, పరులభావములను, కార్యములను, శీలగుణాదులను చూచి నేర్చుకొనుట, తమలో నితరులను నితరులలో తమ్ము చూచుకొనుట, పరస్పరము గ్రహించి యభివృద్ధిచెందుట, సమన్వయశక్తి నలవరచుకొనుట— యివియే మానవాభివృద్ధికి మార్గములు.

ఇంగ్లీషుజాతిని గురించి యొక కవి యిట్లు వర్ణించినాడు "ఒక్క ఆంగ్లేయుడు మందబుద్ధి. ఇద్దరో! అభేద్యమైనజత. ముగ్గురు అసమానజాతి" కనుకనే వారు రెండువందలసంవత్సరములు ఆరువేలమైళ్ళదూరమునుండి నాలుగుకోట్లమంది, నలభైకోట్లమందిని యథేచ్ఛగా పాలింపగలిగిరి. ఆంగ్లేయులనుండి మనము గ్రహింపవలసిన దెంతయో కలదని వేరుగ చెప్పనక్కరలేదు.

మనలో జాతిభావము నశించినది. ఒంటెత్తుతనము, స్వార్థము, కులతత్త్వము మానవవికాసమునకు తోడ్పడజాలవు. సహకారము, పరస్పరత, ఐకమత్యము దివ్యశక్తి నొసంగును. మానవుడు తనకొరకు సంఘముకొరకు గూడ జీవింపవలెను. అతడు తనంతతాను సంఘముద్వారముననుకూడ రాణింపవలెను. సంఘమునకు నేర్పవలెను. సంఘముద్వారా నేర్చుకొనవలెను. శక్తి నొరుల కీయవలెను. ఒరులనుండి గ్రహింపవలెను. ఒకరివల్ల నొకరు ప్రకాశింపవలెను: ఇట్టి భావసంస్కారములేని మానవుడు మానవకీటకము. "పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ" అని భగవద్గీత దేవతలకు మానవులకు బోధించుచున్నది. ఇది యొక మహావాక్యము. నీవిచ్చినదే నీకు సంక్రమించునుగాని, నీవీయనిది నీకు సంక్రమింపజాలదు. నీవిచ్చిన దానినే దేవతలు నీకు పదింతలుగ ప్రసాదింతురు. దేవతలనగా నీ సమస్త యవయవములద్వారా నీవు ప్రసాదించువానిని గ్రహించి తిరిగి నీకిచ్చివేయు యింద్రియాధిష్ఠానశక్తులు. భగవంతు డీవిధముగా నీకు ప్రసాదించిన శక్తులను వ్యర్థపరచుట జీవితమును వ్యర్థపరచుటయే యగును. వ్యర్థముగ జీవించు మానవుడు కీటకమానవుడు లేక మానవకీటకము.

# శరీరము

నేలవిడిచిన సాము లేదు. శరీరము పోయినతరువాత చేయు సాధన లేదు. సాధనకొరకే శరీరమేర్పడినది. కనుకనే 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం' అని పెద్దలు చెప్పినారు. ధర్మమును సాధించు ప్రథమోపకరణమే శరీరము. ఈ జీవితములో నీవు దేనినైనను నీ శరీరముద్వారముననే సాధింపవలెనుకదా! కనుక శరీరముపట్ల శ్రద్ధవహించి దానిని సర్వసమర్థముగ నుండు నట్లు వంచిన తప్ప మన మెంత చదివినను, నెంత తిరిగినను, నేమి చేసినను, నెట్లు కూసినను, బుద్ధిపాటవము, కర్మపాటవము, ధర్మపాటవము చేకూరజాలవు.

శరీరము రథము. ఈ రథము చెడిన రథికుడు వ్యథ చెందును. ఈ శరీరమును జారవిడిచిన మరియొక శరీరము తప్పదు. నాడులు, కండరములు, రక్తవాహినులు, గ్రంథులు, ప్రేవులు, ఆంత్రములు—వీటి యన్యోన్య సామరస్యముచేతనే శరీరయంత్రము, తద్వారా మనోయంత్రము పనిచేయును. శరీరము దుర్బలమైనను, వ్యాధిగ్రస్తమైనను మనస్సుకూడ దుర్బలమగును, వ్యాధిగ్రస్తమగును. దుర్బలశరీరములో దుర్బల మనస్సే యుండునను సామెత కలదు. నరములదార్ఢ్యము లేనివానికి మానసిక స్థైర్యము కొరవడును. మనస్థైర్యము లేని వాడు రాణింపనేరడు. మనస్థైర్యమే యేకాగ్రత, ఏకాగ్రతలేని వాడు జీవితములో గొప్పవిషయములను వేటిని సాధింపనేరడు.

ఏకాగ్రతలోనే సగము విజయముకలదు. మనస్సునెంత శాస్త్రీయముగ, శ్రద్ధగ శిక్షింపవలయునో యంతశ్రద్ధతోనే శరీరమును కూడ శిక్షింపవలయును. ఈ రెంటికి నవినాభావసంబంధము కలదు.

సౌష్ఠవమైన శరీరములో సౌష్టవమైనమనస్సే యుండును. మంచిశరీరమును పొందుటకు హృద్యమైన యాహారము, మిత మైన యాహారము,తగినంత సుఖనిద్ర, నియమముతో చేయు చక్కని శరీరపరిశ్రమ యతిముఖ్యములు.

నిద్రతీరినవెంటనే కొన్ని నిముషములపాటు బంతినలె చురుకైన పరిశ్రమచేసిన శరీరలాఘవము, ఆరోగ్యము చేకూరును. ఈ నియమబద్ధమైన శరీరక్రియవలన మనస్సుకుకూడ సత్ఫలితము చేకూరుచున్నది. నియమానుసారముగచేయు వ్యాయామము మనస్సుకును పరిశ్రమయే యగుచున్నది. ఈ నియమములో మనస్సుయొక్క లొంగుబాటుకలదు. మనస్సు లొంగినపుడు శక్తికలుగుచున్నది. నీ యిచ్ఛాశక్తిని సాధించుకొనుట కిది యొక మార్గము. ఒక్కొక్కపుడు లేచుటకంటె పడుకొనుటయే సుఖముగ కాన్పించును. ఇది కేవలము సోమరితనము. ఇట్టి యలసత్వము నెదుర్కొనినపుడెల్ల నీ బుద్ధిబలము, నిగ్రహశక్తి యధికమగుచుండును. సోమరితనమునకు చోటిచ్చినపుడు నీవోడిపోవుట తథ్యము.

మంచి తెలివిగల యొక స్నేహితుడుండెను. అత డన్ని తరగతులలోను, అన్ని శాస్త్రములలోను ప్రప్రథముడుగ నుండెడివాడు. చక్కని యభిప్రాయములను కలిగియుండెడివాడు. కాని యతి దుర్బల శరీరుడు. కొంచెమించుమించు మొముకల

ప్రోగు. నరముల నాగమ్మ. అతని శరీరదుర్బలత్వము, నర ములనిస్సత్తువ, యస్థిరమనస్సునకు కారణమయ్యెను. అసలే చంచలమైనమనస్సు మరింత చంచలమై సులభముగ కలతచెం దెడిది. అతడు సంకల్పించినదానిని ఘటింపచేయుటకు తగిన శక్తి లేక గడియగడియకు మారిపోవుచుండెడివాడు. మనస్థైర్యము నకు కొంత శరీరదార్ఢ్య ముండితీరవలెను. నరములపాటవము మనఃపాటవముపై ప్రభావము కలిగియుండును. అతనికంటె తక్కువబుద్ధిసూక్ష్మత కలిగియున్నను నెక్కువ శరీరబింకము కలవారెందరో తమతమ సంకల్పములను నెరవేర్చుకొనగలిగిరి. ఆత్మనిగ్రహమును ప్రదర్శించిరి. ఇతడో చంచలమనస్కుడై పేలవజీవితమును గడిపినాడు.

శరీరము దైవదత్తమైన రథము; లేదా యది నీకర్మఫలము. దానియారోగ్యమును, పవిత్రతను నిరసింపక సర్వదా రక్షించు కొనవలెను. అది యొక పవిత్రకార్యముకొరకే యేర్పడినది. అది యాత్మదేవుని మందిరము. ఇట్టి మందిరమును పవిత్రముగ పాటింపక యన్యథాభావించుట జీవితమువట్ల, తమవట్ల గౌర వములేనివారివని. శరీరమే సమస్తమునని మురిసిపోరాదు కాని పటుతరమైనజీవితము గడుపుటకు నిర్దుష్టమై వశవర్తిగనుండు శరీరమును సాధింపకతప్పదు. శరీరలాఘవము, శరీరపుష్టి, శరీర జిగి మానసికబింకమును సడలనీయదు.

శరీరముద్వారా మనస్సును, మనస్సుద్వారా శరీర మును పాలించుకొనవచ్చును. ఈ సాధనకలవారి కితరభేషజ ములతో నంతగా పనిలేదు. అల్లరిచిల్లరి వైద్యము లక్కరలేదు.

రోగమే వారినిచేరుటకు భయపడును. జీర్ణమవకుండ నథమము నూరేండ్లు జీవింపగల శరీరయంత్రమే నీకు ప్రసాదింపబడగా 'డొక్కుజీవితము' జీవించు టెవరితప్పు? బలము నీ నైజగుణము. దుర్బలత్వము నీవు తెచ్చిపెట్టుకొనిన కొరివి.

# ప్రాతరుత్థానము

సృష్టితోపాటు తెల్లవారుజాముననే లేచుట మన ప్రథమ కర్తవ్యము. ఇది మొట్టమొదటి దినచర్య. కాని యింతటి యారోగ్యప్రదమైనది, ప్రాణమును పొడిగించునది మరియొకటి లేదు. దీనిని బ్రాహ్మీముహూర్తమని ప్రాణమునేకాక జ్ఞానమునుకూడ ప్రసాదింపగల ముహూర్తమని పూర్వులు చాటినారు. ఈ విషయమును పశు, పక్ష్యాదులు గ్రహించినవి. ఓషధిరాజైన చంద్రుని యమృతకిరణములతో దీప్తిని, పుష్టిని చెంది సవనవగా విసరు శీతవాయువుల సుగంధముకాని ప్రాణశక్తికాని నేటినగరవాసు లెరుంగకపోవుటలో నాశ్చర్యములేదు. నేటి నాగరికచిహ్నములగు సినిమా యిత్యాది వినోదములలో మునిగి యుదయము తొమ్మిదిగంటలవరకు లేవకపోవుట పరిపాటియైనది. ప్రాణులను ప్రాణవంతముచేయు దివ్యశక్తి ననుభవింపజాలని దౌర్భాగ్యలక్షణము నాగరికచిహ్నమయినది. ఇట్టి యమృతవాయువులను సేవింపనికారణముచేతనే నేడు క్షయ, శ్వాసకాసాది రోగములు మన యింటి యతిథులైనవి.

చక్కగా లేచుటకు చక్కగా నిద్రింపవలెను. సుఖనిద్రయే ప్రకృతి మనకు ప్రసాదించిన గొప్పవరము. సుఖనిద్రపోవుటకు శరీరము నలయింపవలెను. నిద్రపోగొట్టుకొని నిద్రమత్తుతో చేయుపని యకటానికటముగ నుండును. దానిప్రభావము ప్రతి దినచర్యలోను కాన్పించుచునేయుండును.

పగటినిద్రకు, సోమరితనమునకు, బుద్ధిమాంద్యమునకు చోటీయరాదు. ఉదయించినసూర్యుడు మధ్యమధ్య నిద్రపోవుట లేదు. గూండ్లువీడిన పక్షులు సాయంత్రమంవరకు తమ కులాయ ములకు చేరుటలేదు. ప్రకృతితో లేచి ప్రకృతితో నిద్రించు జంతు వులకు వైద్యమక్కరలేదు. ప్రకృతిధిక్కారమే రోగకారణము. ప్రకృతిపాలిక యమృతోపమానము.

పాటలతోను, పద్యములతోను, శ్లోకములతోను తల్లి దండ్రులు పిల్లలను ప్రాతఃకాలముననే లేపవలెను. ఇది యతి ప్రధానమైన యభ్యాసము. అభ్యాసముచేతనే యిదిచేకూరును. ఊరుకొనుమా యిది కొంపదీయును. లేచుటకంటె లేవకుండ బద్ధకముగ పరుపుపై యిటునటు దొర్లుటయే యింపుగను సౌఖ్యముగను కన్పించును. నీవు నిద్రింపనైననిద్రింపవలెను. సుఖ ముగ, గాఢముగ నిద్రింపవలెను. లేదా లేచి పనిచేయవలెను. ఈ రెంటికిచెందనిపని మానవుడొక్కడే చేయుచున్నాడు. అది యతని 'జన్మహక్కు' కాబోలును.

బద్ధకముతోచినపుడెల్ల నీవు నడుముకట్టి, వెన్నువిరిచి, రొమ్మువూరించి దానిని ముదిరిపోకమునుపే ధిక్కరింపవల యును. ఇట్లుచేసినపుడెల్ల నీ యిచ్ఛాశక్తి యినుమడించుచునే యుండును. నీ నిశ్చయముప్రకారము చేయజాలనినాడు నీవు

దుర్బలుడవే యగుదువు. దుర్బలుడు జీవితపోరాటములో 'డంకర్న్యు' మార్గముపట్టక తప్పదు.

పశుపక్ష్యాదుల నెవడు లేపుచున్నాడు? ప్రకృతితోనే యవి తమపనులను ప్రారంభించును. వాటికి గడియారము లక్కరలేదు. బుద్ధిగలిగినమానవుడు గడియారములను జోకొట్టి వాటి నలంకారముగ చేతికితగిలించుకొని ప్రకృతికెదురీత సాగించుచు తగినఫలితము ననుభవించుచున్నాడు.

అలసించు టొకవ్యాధి. అది తెలియరానివ్యాధి. వ్యాధి యనుటకంటె దానిని 'అధి' యనుటయే సబబు. 'అధి' యనగా మనస్సులోప్రవేశించు తెగులు. కనుక నీ తెగులుకు మందు మనస్సులోనే కలదు. లేచుటకు బద్ధకముగ నుండవచ్చును. నిద్ర పోవుటకుముందు 'నేను వేకువజాముననే లేవవలయును, లేవగలను. ముమ్మాటికి లేవగలను.' అని నీకునీవు చెప్పుకొనవలెను. దానిని బిగ్గరగ పైకిచెప్పుకొనుట మరింత మంచిది. అట్లు నిక్కచ్చిగ చెప్పుకొని చెప్పినట్లుచేయవలెను. ఇది ప్రకటనార్థము చెప్పుకొనుటకాదు. నీ యాచరణకొరకే నీ విట్లు హృదయపూర్వకముగ, భావశుద్ధితో చెప్పుకొనవలెను. భావములేని శుష్కవాగ్జాల మెంత ఖర్చుపెట్టినను లాభములేదు. నాలుక వెనుక హృదయము ప్రతిధ్వనింపవలెను. హార్ద్రరసాయనముతో మిళితముగాని పొడిమాటలు 'పుష్పితవచనములు' నిరర్థకములు.

మానవయంత్రమును నడుపు నరములు, నాడులు హృదయకుహరమునుండి బయల్వెడలు భాషనే యర్థముచేసికొనును గాని పొడిమాటలను సరకుచేయవు. అవి యట్టి

యాజ్ఞలనే శిరసావహించును. కనుక నీవు మొదట నీ బాహ్య మనస్సులో నిశ్చయించుకొని యా నిశ్చయమును నీ యాంతరంగిక మనస్సు కందింపవలెను. ఆంతరంగిక మనస్సు నీ యాజ్ఞలను నీ నాడులద్వారా పనిచేయించు నీ దివానువంటిది. ఇది యెన్నడును నిద్రింపక చెప్పుచేతడవుగ నీ కార్యములను చక్కబెట్టుచుండును. ఇది నీ యాంతరంగిక కార్యకర్త; శక్తివంతమైన కార్యకర్త.

ఒక విషయము గమనింపదగును. నీ మనస్సులో ననేక కోరికలుండవచ్చును. విరుద్ధకోరికలుండవచ్చును. నీ యంతరంగ మనస్సు నీ మనస్సులో ప్రథమస్థానమువహించుకోరికనే పాటించును. కనుక నీవు వారంవారము నిత్యము 'ఈపనిచేయవలెను, చేయగలను, చేసితీరుదును' అని నీకునీవు చెప్పుకొనవలెను. ఇట్లు కొన్నిరాత్రులు చేసితివేని నీ కది యభ్యస్తమగును.

అభ్యాసమే మానవుడు. అదియే మానవయంత్రమును నడుపు గొప్పశక్తి. ఇదొక్కటియే మానవుని గొప్పవానినిగ చేయగలశక్తి యనినను దోషములేదు. అభ్యాసము రెండవ ప్రకృతి యగుచున్నది. లేచినదిమొదలు తిరిగి పడుకొనువరకు మనము చేయుపనులన్నియు నభ్యాసవశముననే జరుపబడుచున్నవి. అభ్యాసమువలననే మానవుడుపరిపూర్ణుడగుచున్నాడు. నీ కర్తవ్యకార్యములను నిశ్చయించుకొని వాటి నభ్యాసపూర్వకముగ చేయవలెను. అభ్యాసమువంటి మందు వేరొకటిలేదు; సాధనలేదు.

# మంత్రశక్తి

మంత్రశక్తి యనగా నాలోచించుశక్తి. చక్కగా యోచించుశక్తి. 'ఉత్సాహప్రభుమంత్రశక్తియుతనే యుద్యోగము' అని హిరణ్యకశిపుడు కుమారుడైన ప్రహ్లాదుని ప్రశ్నించి యతని విద్యాపరిశ్రమను గురించి తెలిసికొనగోరును. ఆలోచన చేయువానిని, ఆలోచన చెప్పువానిని మంత్రియని తత్కర్మ మంత్రాంగమని యందుము కదా. మంత్రము సకలకర్మలకు మూలము.

మానవయంత్రమునుండి మనస్సును, మననము చేయు శక్తిని, ఆలోచనాభాగమును తీసివేసితి మనుకొనుము. అప్పుడిక మిగులునదేది? ద్విపాదజంతువు. ఆహార, నిద్రా, భయ, మైథునములతో తృప్తిపడు పశువు. జంతుబలము, జంతుశక్తి, జంతుక్రియలు మానవున కెంత యవసరమైనను నంతటితో మానవత్వము పూర్తియగుటలేదు. పైకార్యములను యథోచితముగ, నియమముగ నడుపుచు, వాటిపై రాజ్యముచేయు మరియొక శక్తి మానవునిలో కలదు. అదియే ధీశక్తి. మానవుని నడిపించు చోదనశక్తి.

మనలో నిట్టిశక్తియున్నదని, దీనిని నిరంతరాభ్యాసముచే పెంపుచేసికొని జీవితమును చరితార్థము చేసికొననలయునని గ్రహించపకపోవుటయే మానవవిషాదమునకు కారణము.

చూచుటచేతనే కన్ను, వినుటచేతనే చెవి, చేయుటచేతనే చేయి, నడచుటచేతనే కాళ్ళు, తమ తమ పనులను

నిర్వర్తించుచు నిలబడుచున్నవి. అవి యందుకే నిర్మింపబడి వాటిమూలముననే వృద్ధియగుచున్నవి. ఇవి పైకికనిపించు మానవ శరీరములోనిభాగములు. స్థూలచక్షుగోచరములు, శరీరయాత్ర కవసరమైనవని గుర్తింపబడినవి కనుక వాడబడుచున్నవి. వీటిని కూడ విధిపూర్వకముగ వాడువారు బహు అరుదు.

ఇక మనస్సు కంటికికన్పించదు. నూటికి తొంభైమందికి దానియునికి, విశిష్టత, నిజప్రయోజనము తెలియనే తెలియదు. అదియొకటి కలదని మాటవరస కంగీకరించినంత మాత్రమున లాభము లేదు. ఇంటనున్న యిత్తడిచెంబుకు, అలుకుగుడ్డకు, చీపురుకట్టకు నిత్యముపని చెప్పుచున్నారమే, మనసు కేపని చెప్పుచున్నాము? ఏమి ప్రయోజనము కల్పించుచున్నాము? ప్రతి రోజు చెంబులు తోముచున్నాము, బట్టలుతుకుచున్నాము, శరీరము కడుగుచున్నాము, ఇలుఅలికి శుభ్రముచేయుచున్నాము, మనస్సునేమిచేయుచున్నాము? మనస్సును బుద్ధిపూర్వకముగ మన వికాసమునకు వినియోగించుకొనుటలోనే గొప్పతనము, శక్తి యేర్పడుచున్నవి.

నిజమునకు నీవెవరవు? నీవుమనిసివి. మనసుకలవాడవు, అది కనిపించనిది. సూక్ష్మమైనది కనుక మరింతశక్తివంతమైనది. కనిపించువానిమీద ప్రభావము కలది. కనిపించువాటిని కదలించుశక్తి. ఒరులకు కాదు నీకే తెలియకుండ పెరిగిపోవుచుండు శక్తి, దేనినైనను సాధింపగలశక్తి, కొండలను బెండులవలె తేలింపచేయగలశక్తి.

కనుక నిట్టిదానిని బాల్యమునుండి, మొదటనుండి శిక్షించి, నిరంతరాభ్యాసముచే పదనుపెట్టి, వివేకముతో విని

యోగించుటయే నీ కర్మము, నీ ధర్మము, నీ యభివృద్ధి. రాళ్ళ మీద, చెట్లమీద, జంతువులమీద, నిధి నిక్షేపములమీద చేయురాజ్యముకంటె నీ మానసక్షేత్రముపై చేయురాజ్యమే నీకవిరళ సుఖశాంతులను ప్రసాదింపగలదు. ఇదియే నిన్ను నీ నిజోన్నతికి గొంపోవు రాచబాట.

ఆలోచింపనేయాలోచింపక, మెదడును వినియోగింపక, మొద్దువలె జీవించువారుందురా? ఉండరు. అది యసంభవము. ప్రతివాడు తనమనస్సు నేదోవిధముగ, నేదోపనిమీద, యంత్రవతుగ నుపయోగించుచున్నాడు. కాని యిదిచాలదు. ప్రయత్నపూర్వకముగ, బుద్ధిపూర్వకముగ మనస్సును శిక్షించి, చిక్కబట్టి దానినొక విద్యుచ్ఛక్తివలె ప్రయోగింపనేర్చినవారే ప్రతిభావంతులగుదురు. ఇది యసాధ్యవిషయము కాదు. మన కండ్లయెదుటనే యెందరో యిట్టి ప్రతిభ సంపాదించిరి. నిత్యసాధనచేత నిది నీ పెరటిచెట్టువలె నీసేవచేయును. ప్రయత్నమే యున్ననాడు ప్రతివాడు దీనిని తనశక్తికొలది సాధింపవచ్చును. సాధింపబడిన మనస్సు నిన్ను నీవు మించునట్లు చేయగలదు.

మననము నభ్యసించు టొక దివ్యమైనకళ. ఉపజ్ఞను ప్రసాదించు అసమానమైనకళ. అభ్యసింపదగినకళ. జీవితమునకు జీవితమును ప్రసాదించు విశేషమైనకళ. నీయనుభవమే దీనిని నీకు రుజువుచేయగలదు. కేవలము కర్మచేయు కార్మికునిమీద బుద్ధిబలముతో దానిని చేయగలవాడు యాజమాన్యము వహించుటలేదా! మంత్ర కార్యశక్తులు రెండును కలవారే నేటి ప్రపంచములో నత్యున్నతస్థానము నలంకరింపగలరు. మహాత్ముడే యిందుకు ప్రత్యక్షసాక్ష్యము. అట్టివారే ప్రపంచనాయకులు

కాగలరు. అభ్యాసముచేయుటకు కాలాతీతమను శంకలేదు. 'ఇప్పుడే యీనిమిషమందే మనము ప్రారంభించవచ్చును. వెన్ను ముదిరినకొలది యేపనియైనను కొంతకష్టమగుచుండును. కనుక కళ్యాణకార్యములను మనము జీవితారంభమునుండియే యభ్యసించుట మంచిది. మననముచేయుటకు నిత్యము కొంతకాలమును వినియోగింపవలెను. అట్లు వినియోగించి సిద్ధహస్తులైనవారినే యీ ప్రపంచము బహూకరించును. వారియునికియే 'జీవిత' మనిపించుకొనును.

తక్కిన వారియునికి చెట్టుచేమలజీవితము. అవిమాత్రము జీవించుటలేదా? పెరుగుటలేదా! నశించుటలేదా! మానవచరిత్ర యింతటితో నాగిపోవుటలేదు. తనమనస్సును శిక్షించి బలసంపన్నమైనదానిగ చేయు వ్యక్తి, జాతి ముందుకు వచ్చుచున్నవి. అలసులు, మందబుద్ధులు దిగజారిపోవుచున్నారు. ఈ యుగము ద్రవ్యయుగను. పదార్థమునే నమ్మయుగము. సమస్తము చేతికి చిక్కవలెను. కంటికి కనిపించవలెను. కంటికి కనిపించనిది లేని దానితో లెక్క. ఇది కేవలము ద్రవ్యమైకము, విషయమైకము. ఈ మైకమునుండి ప్రజలు మేల్కొనవలెను. శబ్దాడంబరమేమియు చేయక నజ్ఞాతముగ తెరవెనుక పనిచేయుశక్తి యొకటి కలదు. "నేటిప్రపంచములో పదార్థశాస్త్రము, రసాయనశాస్త్రము, ఖగోళ, భూగోళ, ఖనిజ, వృక్ష, జంతుశాస్త్రములు మొదలగు చిల్లరశాస్త్రములెన్నియో పెరిగినవి. కాని తత్తుల్యముగ మానవ శాస్త్రము పెరుగలేదు. నేటి దుస్థితికంతకు నిదియే కారణము. మానవు డొక్క ద్రవ్యమునుతప్ప తక్కిన సమస్తమును నిర్ల

త్యము చేయుచున్నాడు" అని అలెక్సిస్ కారెల్ తన 'అజ్ఞాత మానవుడు' అను గ్రంథములో వ్రాసియున్నాడు.

మనస్సే బంధమోక్షములకు కారణము. ఈ మనస్సు నీలోనే యున్నది. నీవే యీ మనస్సు. దీనిని పదనుపట్టినకొలది తేజరిల్లును. పరిశుద్ధమగును. అజ్ఞానము తొలగిపోవును. దుర్బలత దూరమైపోవును. మనోబలమే నీ నిజధనము.

# దుఃఖము

దుఃఖ మొకవ్యాధి. తెచ్చిపెట్టుకొనువ్యాధి. ఊహామీద విజృంభించువ్యాధి. పెంచినకొలది పెరుగు వ్యాధి. ఇది సమస్తమును, ప్రపంచమునంతను దుఃఖమయముగ మార్చివేయు జాడ్యము. ఇది కేవలము మానసికవికారమేతప్ప దీనికొక యస్తిత్వము లేదు. నీవనుకొనుటచేతనే యిది నిన్ను ఆవహించుచున్నది. లేనిదానిని, రానిదానిని, జరుగనిదానిని, పోయినదానిని గురించి యూహించుకొని డిల్లపోయి నీవు బాధపడుచు నితరులను బాధపెట్టు మానసికవికారమే దుఃఖము.

ఊహించినంతమాత్రముచేతనే వ్యాధులు సంభవించునా? గాలియే ఘనీభవించునా? అవును. నిజమునకు జరుగుచున్నదంతయు నీ విషాదనాటకమే. లేనిపోని యపేక్షలవలన, ఫలము నాశించుటవలన, న్యాయమైన యోపికపట్టకపోవుటవలన, ప్రయోజనములేనిదానికొరకు విలపించుటవలన కలుగు వృథాయాసమే విచారము.

'నే నేల విచారపడవలెనో తెలియకున్నది. సూర్య చంద్రులు, నక్షత్రగణము, పంచభూతములు, వినిర్మల వినీలా కాశవితానము నాకు బాసటలై సేవచేయుచుండ నాకేమి కొదువ' అని యొకకన్య హెచ్చరించిన గాథను మార్డెను మహా శయుడు మనకు తెలిపియున్నాడు. గతించినదానికి విచారపడి లాభములేదు. రానున్న యుపద్రవముకొరకు పరితాపపడుట యవివేకము.

మాయింటిప్రక్కనున్న యొకస్త్రీ చనిపోయిన కుమా రునికొరకహర్నిశలు నెలలంతరబడి పెద్దగొంతుకతో రోదిం చుచు, బాదుకొనుచు తన సుఖమును చుట్టుప్రక్కలవారి సుఖ మును పోగొట్టుచు తనకు కలిగిన తీరనికష్టమున కితరులు తనపై చూపుచుండు సానుభూతికూడ పోగొట్టుకొనుచు తన శరీరము నకే తెగులు తెచ్చుకొనెను. దుఃఖములన్నియు కొంచె మించుమించు యీ స్థాయిలోనే యుండును. దుఃఖించుట దేనికి? చికాకు, చీదర, చిందులుత్రొక్కుట, కోపతాపములు, విసుగు, తామసము – ఇత్యాదులన్నియు నొకజాతిలోనివే. ఎంత కారణమున్నను, గొప్పయుపచారమే జరిగినను సమత్వ మును పోగొట్టుకొని చికాకుపడుచుండు స్వభావముగలవానిని చూచునపుడు నీభావమెట్లుండును? అతడు బ్రహ్మాండనాయ కుడే యగుగాక! అయినను నీ కతనిపట్ల తత్పూర్వముగల గౌరవభావము కొంత తగ్గిపోవుచున్నది. కనుక నీవు నీమనస్సు నెన్నడు కలతపరచరాదు.

నీ ముఖ మెల్లపుడు హసించుచునే యుండవలెను. హస న్ముఖుని యాయురారోగ్యములు వాటంతటవియే వృద్ధి

చెందును. ఈసారి నీకు కోపము కలిగినపుడు, నీ నందరిమీద చిందులుత్రొక్కవలెననుకొన్నపుడు కొంచెముసేపు నిన్ను నీవు నిలువరించుకొనుము; స్థిమితపడుము. కొద్ది యోచికవహించుము. కోపవిషయముపై నీ దృష్టి సారింపుము.

నీకోపమునకు నీవనుకొనిన యపచారము కారణమగునో కాదో మొదట తేల్చుకొనుము. నీవు యోచన ప్రారంభించు సరికి చివరకు కోపమునకు సిసలైన కారణమే లేకపోవచ్చును. కారణమున్నదా? దానిని దాచిపెట్టకుము. అణచిపెట్టకుము.

నీ భార్యతోనో, నీ స్నేహితునితోనో, మరెవ్వతోనో దానినిగురించి చెప్పివేయుము. దాపరికమేమియు లేకుండ నిశ్శేషముగా చెప్పివేయుము. అట్లు చెప్పుటచేత నీ వంతవరకు త్రొక్కిపెట్టుచువచ్చుచున్న దుష్టశక్తిని, మలినశక్తిని పోదోలినవాడవగుదువు. నీలోనున్న విచారవిషాంకురము నంతటితో నూడబెరికినవాడ వగుదువు.

దానితో నిన్ను కలవరపరచుచునచ్చిన యపహ్యాభావ మంతరించును. నీమీద, నీవుచేయు ప్రతిపనిమీద దానికిగల ప్రభావ మంతటితో స్వస్తిచెప్పకొనును. నీవొక కొత్తవ్యక్తివే యగుదువు. నీ శాంతిని పోగొట్టి నీకు నీచుట్టుప్రక్కలవారికిగూడ ముళ్ళగుత్తివలెనుండిన విషయము, నిజమైనస్థితిలేని విషయ మంతటితో నంతమొందును.

విలపించుటలో గుణమేమియు లేదు. సృజనశక్తియు లేదు. అది నీశక్తిని వ్యర్థముచేయు 'ఋణమే' కాని 'ధనము' కాదు. విలాప మెంత దీర్ఘముగా జరుపబడినను దేనిని ప్రసాదించి యుండలేదు. మనస్సు అతి విచిత్రమైనశక్తి. మానససరస్సులో

నసహ్యాభావములన్నియు నమగునకు దిగిపోవుచుండును, వాటిని మనము తాత్కాలికముగా మరచిపోవుదుము. కాని యవి యక్కడ నక్కడయుండి తమప్రభావమును చూపుచునేయుండును. వికారశక్తిని పుట్టించుచునేయుండును. కనుక నసహ్యాభావములనే మనము మొదలంట తుడిచిపెట్టిననాడు సుఖులమగుదుము. శుభులమగుదుము.

నిలకడమీదనే నిజము తేలుచుండును కదా! నూటికి తొంబైపాళ్ళు మన మతిస్వల్పవిషయములకే పరులతో తగవులాడుచుందుమని, ప్రమాదమువలననే కోపము కలుగుచుండునని, రాగము, ద్వేషము మనకు తెలియకుండగనే మనలో వికారములను కలిగించునని విదితమగుచుండును. అప్పుడు మనమిక దుఃఖింపవలసిన విషయమే కాన్పించదు.

ఇంకొక విషయము. మానవయంత్ర మెందుల కేర్పడినది? అవి శుభముకొరకు, కల్యాణముకొరకు, అభ్యుదయముకొరకు, ఆనందముకొరకు నేర్పడినది. తక్కిన వికారములను రానిమ్ము పోనిమ్ము. నీవు వాటిని శరింపనక్కరలేదు. శపింపనక్కరలేదు. నీలో వాటి కెంతమాత్రము స్థావరము కల్పింపకుండినచో నవియే పలాయనమంత్రముజపించును.

# సమయపాలన

సమయముయొక్కవిలువను గుర్తింపకపోవుట, అనుకొన్నప్రకారము రాకపోవుట, చేయకపోవుట, నియామ

కము లేకుండ కనపడినచోట గంటలతరబడి సోదె వేయుచు తన కాలమును గెంటుట కితరులకాలమును పాడుచేయుట – నేడిది మన సామాన్యలక్షణముగ కాన్పించుచున్నది. ఇది కేవలము మనజాతికే కళంకమని చెప్పకతప్పదు.

కాలమే ధనము, కాలమే శక్తి, కాలమే వృద్ధి. కాలమే చివరకు మృత్యువు.

శ్లో॥ కాలోస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః॥

'నేను కాలమును, లోకమును క్షయింపను, వృద్ధిపొందింపనుగలవాడను. నేడు లోకములోనివారలను సంహరించుటకే వచ్చినవాడను' అని శ్రీకృష్ణుడు 'ఉగ్రరూపమును ధరించిన మీ రెవరో నాకు తెలియబలుకుడు' అని ప్రశ్నించిన యర్జునునకు సమాధానము చెప్పెను.

కనుక కాలముయొక్క విలువను గుర్తింపుము. కాలమును పాటింపకపోవుట మహాదోషము. ఒక యాశయము, కర్తవ్య కార్యము, నీతినియమము, నిర్ణయము కలవారే కాలమును పాటింతురు. ఆశయహీనులకు, సోమరులకు కాలజ్ఞానముండదు.

కాలమును పాటింపనివానికి జీవితప్రయోజనమే తెలియదు. జీవితప్రయోజనము నెరుగనివా డెప్పు డెచ్చట నేమి సాధించెను? అట్టివా డెప్పుడో, యెచ్చటనో, యే పేకాటలోనో, యే బ్రాకెటు వేటలోనో హతాశుడై మృతిచెందును. ఇట్టివారి నెందరిని మనము చూడలేదు! చూచుటలేదు!

ఆశయము, భావము, కాలముమీద, నీమీద ప్రభావము కలిగియుండును. నీభావములే, నీయూహాలే క్రియలుగ

మారునని మనశాస్త్రము చెప్పుచున్నది. భావపటిమలేనివారు క్రియాదక్షులు కాజాలరు. అట్టివారిజీవితములలో చెప్పుకొనదగిన క్రియలే యుండవు.

ఒకవిధి, గరుణిక యాశయము, ధర్మజిజ్ఞాసయున్నవానిని జాడ్యములు దర్శించుటకు భయపడును. నవకవి యొకడు తనకు లేనివ్యాధిని తానే యూహించుకొని, వైద్యులొకనంక తన కేవ్యాధియులేదని చెప్పుచున్నను, తను అనుకొన్నది లేదని రుజువుపరచుకొనుటకు చెన్నపట్టణమువరకుపోయి మూడువేలు ఖర్చుపెట్టుకొని మందులేనివ్యాధితో నింటికిచేరుకొని యింకను మానసిక జాడ్యముతో కుళ్ళుచున్నాడు. చివర కిది జరుగుబడి జాడ్యమని తేలినది. అప్పనముగ దఖలువడినయా స్థిరయొక్క వారసత్వము. చక్కనిభావములు నీకార్యములను, కాలమును చక్కదిద్దును. దుష్టభావములు, దుర్బలభావములు నిన్ను బాధించును. దుర్బలభావమే గరుణిక పెద్దజాడ్యము. సమయమును పాటింపకపోవుట దోషములలో దోషము, దుర్బలత్వము దురభ్యాసము. ఇది నీకు కళంకమునాపాదించు దురాచారము. నిన్ను ప్రతిపనికిపనికిరాకుండచేయున దీ యలసత్వమే.

నీకేదోయొక వృత్తి యుండితీరవలెను. దాని కనుగుణముగ నీ దైనిక కార్యక్రమము నేర్పరచుకొని గడియారమువలె పని చేయుట కలవడవలెను. నీవు నెరవేర్చవలసిన ధర్మముపై నీ లక్ష్యము మరలెనేని నీవు సగము గెల్చితివన్నమాట. ఆత్మపరీక్ష గొప్పశిక్ష. నీకేలక్ష్యములేకపోవుటయే నీదోషములకు కారణమని యిది నీకు చెప్పుచుండును.

నీ కొక యజమాని యుండవచ్చును. అతనియెడల నీవు నీధర్మము నాచరింపవలెను. నీకు నీవే యజమానివైనచో నీపట్ల నీవే నీధర్మము నాచరింపవలెనుకదా! నీ సృష్టికర్తపట్లకూడ నీవు నీధర్మము నాచరింపవలెను. నీ ప్రయోజనము, నీ ధర్మము స్థిరపడిననాడు నీ వరగంట ముందుగనే మేల్కొనుచుందువు. నీబండికో, బస్సుకో అనేక నిమిషములు ముందుగనే హాజరగుదువు. నీపనులు నిమిషముల ప్రకారము జరిగిపోవుచుండును.

నీ జీవితమునకు నీవొక ప్రయోజనము కల్పించిననాడు నీదృష్టియే మారిపోవును. అప్పుడు కాలము నీ వెంట పరుగిడును. గాంధిమహాత్ముడు కాలము నెన్నడు నతిక్రమించియెరుగడు. అతడు పనిచేయునపుడు గడియారమును దిద్దునట్లు పనిచేసెడివాడు. వందలకొలది మైళ్ళు పయనించినను నియమింపబడిన కాలమునకు ముందుగనే హాజరగుట యతనికొక్కనికే చెల్లెను.

అతడు సాధించిన విజయమును వేలకొలది మానవులు వందలకొలది సంవత్సరములు కృషిచేసినను సాధింపజాలరు. అంతచేసినను అతనికింకను తీరికయుండెడిది. తనధర్మము నెరిగి పాటించువాడు సమయమును దాటనీయడు. ధర్మమే మానవుని నిలబెట్టు గొప్పశక్తి. సమయమును పాటించువారికి ధర్మదేవత కూడ జోహారులర్పించును.

## విశ్రాంతి

ప్రతివానికి విశ్రాంతియుండవలయును. రోజంతయు చెమటోడ్చి పనిచేయు కష్టజీవికి, బుద్ధితో పనిచేయు విద్వాంసునకు,

గృహపాలనముచేయు స్త్రీకి, చివరకు పశుపక్ష్యాదులకుకూడ విశ్రాంతి యవసరము.

రక్తమాంసములతో పనిచేయు అయఃపిండములకే విశ్రాంతి యవసరమైనప్పుడిక మానవులకు దాని ప్రయోజనము గురించిచెప్పనక్కరలేదు. ఎడతెగనిపనిని యేజీవి భరింపజాలదు. కాని విశ్రాంతికిని సోమరితనమునకును నెంతేని భేదముకలదు. సోమరితనము విశ్రాంతి కాజాలదు. ఎట్టివాడును సోమరిగ నుండ రాదు. నియమముప్రకారము చరచర పనిచేసికొనిపోవువానికి కావలసినంత విశ్రాంతియుండును.

పనిచేయక సోమరిగ యూరకుండుట విశ్రాంతి కాజాలదు. మానసికముగపొందు విశ్రాంతియే సరియైన విశ్రాంతి. పైకి పనిచేయకున్నను మానసికముగ చేయు కుట్రలు, పన్నాగములు, దుర్మార్గపుటాలోచనలు లేదా యాత్మవిచారణ, భగవద్ధ్యానము, శాస్త్రపరిశోధనాదులు పనియేయగుచున్నవి. ఇవి మానసికముగ జరుగుచుండుపనులు.

కనుక పనియైనను, విశ్రాంతియైనను మానసికసంబంధమైనవి. మానసికవిశ్రాంతి ననుభవింపనివాడు రోజంతయు పర్యంకములమీఁద దొర్లినను, వెండి బంగారములతో తులతూగినను సుఖశాంతులను పొందుటలేదు.

ఏపనియు చేయకుండు టసంభవము. కనుక పనిచేయని వాడు చేటుకార్యము చేయుచున్నాడనియే భావింపవలెను. ఒకే పనిని చేయుటలో విసుగుదల, యలసట, నవ్యతలేకపోవుట, రుచి తగ్గిపోవుట, మందకొడితనము సంభవింపవచ్చును.

అట్టి సమయములలో నాటపాటలు, మృదంగము, తోట పని, చిత్రలేఖనము - మొదలగువానిని సమయానుకూలము గను, మన యభిరుచికనువుగను మార్పుచేసికొనుటయే విశ్రాంతి యగును. కలముతో పనిచేయు గ్రంథక ర్తకు తోటపని మంచి విశ్రాంతి, వర్తకము, వ్యవసాయము చేయువారికి గ్రంథపఠనము చక్కనిమార్పు, విశ్రాంతి, సుఖము చేకూర్చవచ్చును. రోజంతయు కాయకష్టముచేయు కూలివానికే కథాకాలక్షేపమో, వ్రాత నేర్చుకొనుటో చదువుటో, విశ్రాంతియే కావచ్చును. కాలమును దుర్వినియోగముచేయక, సోమరిగ నుండక, పనిచేయుటలో మార్పులుచేసికొనుచు ననుభవించు విశ్రాంతియే వ్యక్తికిని, సంఘమునకును కూడ పరమశ్రేయస్కరము.

ఏది పని? ఏది విశ్రాంతి? ఏది సోమరితనము? అని తర్కింపవలదా? ఒక యరుగుమీద పదిమందికూర్చుని పేకాట యాడుచుందురు. ఇది విశ్రాంతియా? ఇదిసోమరితనము. దీనిలో గుణములేదు; మార్పులేదు; మనశ్శాంతిలేదు. అభివృద్ధిలేదు. చివరకు 'శిఖపట్లగోత్రము'లోనికి దింపు యీ నికృష్టకర్మ విశ్రాంతి యెట్లగును?

ఇంకొకచోట నొక గుడిలో వందమంది భజనచేయు చుందురు. లేదా హరికథాకాలక్షేపముచేయుచుందురు. సంగీత కచేరి జరుగుచుండును. ఇది విశ్రాంతి, ఆనందము, సుఖము. ఇందులో హృదయవికాసము, తన్మయత్వము, అభివృద్ధి కలవు. ఇంద్రియములకు మనస్సుకు పనికల్పింపక నూరక కూర్చొను వారు దురదృష్టవంతులు; దుఃఖితాత్ములు. వారిబుద్ధి దుష్ట

కార్యములనీాదకుపోవును. లేదా దానికి వికాసము, యెదుగు బొదుగులు లేక మొద్దుబారిపోవును. తేజోవిహీనమగును. అప్పు డప్పు డతిసల్పకాలము పనినుండి పూర్తిగా విరామముపొందుట మంచిదే. కాని దాని నొక మందువలెనే వాడవలెను. మందు ఆరోగ్యవంతుల కవసరములేదు కదా! ఊరకకూర్చొనుట పైకి సుఖమనిపించవచ్చును. తేలికయనిపించును. మొట్టమొదట నందులో హాయియున్నట్లే యనుభవింతుము. కాని యేమా త్రము మోతాదు తప్పినను నది జాడ్యమేయగును. విశ్రాంతి మందు కాని యాహారము కాదు. పనియే మానవునకు తగిన యాహారము. ఆహారమునుకల్పించు నాహారము.

'భూతిః శ్రీర్హ్రీ ధృతిః కీర్తిర్దక్షేవసతినాలసే' ఐశ్వర్యము, వినయము, ధైర్యము, కీర్తి కార్యదక్షులైనవారికి చేకూరును గాని సోమరులకు ప్రాప్తించవు. ఇవి యక్కరలేనివారు మానవ లోకమునకు గాక మరియొక లోకమునకు చెందుదురు.

సోమరితనమును నిర్వీర్యతను కలిగించునది విశ్రాంతి కాజాలదు. శ్రమనుపోగొట్టలేని విశ్రాంతి విశ్రాంతియెట్లగును? నిన్ను క్రొత్తమానవునిగా చేయునది, నీకార్యదక్షతను పెంచు నదిమాత్రమే విశ్రాంతియగును. క్లబ్బులలోని 'గబ్బువాసన' విశ్రాంతి కానేరదు. నేడది తీరికగకూర్చొని దేశములోని ముసుగుకాల్వల నన్నింటిని పరీక్షించుటకు తమంతతాముగా నేర్పడినవారి 'కర్మ'గా పరిణమించినది.

నీ తీరికకాలమునుకూడ మంచి మెలకువతో నుపయో గింపుము. "తమ మానుషీధనమును అనగా నరములద్వారా ప్రవహించు అమూల్యశక్తి నేదో యొక సృజనాత్మకకలావ

మునకు వినియోగించువారే ధన్యాత్ములు" అని యొక మానస తత్త్వవేత్త వచించెను.

కరచరణాదులు తూష్ణీంభావము వహించినను లేక నెడ తెగక పనిచేయుచున్నను మనస్సును యుక్తియుక్తముగ నువయోగించు మానవు డెంతేని విశ్రాంతి ననుభవింపవచ్చును. స్వర్గమును సృజించుకొనవచ్చును. లేదా ఆ మనస్సుతోనే నరకమును సృజించుకొనవచ్చును.

# ప్రయోజనము

మానవు డొక విశిష్టయంత్రమని, విచిత్రయంత్రమని, సమగ్రనిర్వచనముచేయ వీలులేనియంత్రమని గ్రహించితిమి. ఈ యంత్రములో నొక నిక్షేపము, నిగూఢశక్తి కలదు. ఎఱుక గలిగి దీనిని త్రవ్వుకొనువారి కిది కల్పతరువు; కామధేనువు.

మంత్రశక్తి, కార్యశక్తి, యుత్సాహశక్తి మొదలగు సమస్తశక్తులకు తగిన సర్వసంభారములను ప్రకృతి మనలో నమర్చియుంచినదియని తేలినది.

కాని తగిన దోహదముచేయనిచో నీ శక్తులు నీలో నణగిమణగియుండును. సాధనచేసినకొలది, యభ్యసించినకొలది మానవత్వము, మానవయంత్రము నిరుష్టమగును, నిగ్గుతేరును. పవిత్రమగును. మానవునకు జన్మచే సంభవించు శక్తిసంపదల కంటె జీవితరంగములో సాధింపగల విశేషతయే ప్రధానమైనది.

పశువులకు జన్మయే ప్రాముఖ్యము. జన్మయే వాటిగుణము లను, స్వభావములను, సహజశక్తులను నిర్ణయించును. మానవులకు జన్మకంటె కర్మయే యెక్కువ ప్రధానము. మానవుడు పుట్టులక్షణములతోనే యాగిపోజాలడు. ఒకకులములో లేదా యొకయింటపుట్టిన నలుగురు సోదరులు నాలుగువిధములుగ తమ తమకర్మలనుబట్టి వృద్ధిచెందుచున్నారేకాని యొకే మూసలోని విగ్రహములవలె తయారగుటలేదు. మానవస్వభావములు లేత మొలకలవంటివి. వాటిని దోహదముచేయక నెండకట్టినచో శోషించి శోషించి, చివర కంతరించిపోవును. చక్కగా పోషించిననాడు పెరిగి వృక్షరాజములగును. ప్రతివానికి నేదో యొక యభిమానవిద్య, కళ లేక పని యుండవలయును. తినితిరుగుటయే మానవలక్ష్యము కాదుకదా! జీవితమును శుచివంతము, సుఖవంతము, శోభాయమానము చేసికొనుటకేమికావలయును? ఒక ప్రయోజనము, ఒకలక్ష్యము. 'ప్రయోజనమనుద్దిశ్యనమందోపి ప్రవర్తతే' ఏ ప్రయోజనము నేలక్ష్యము లేకుండ నెంతటిమందుడైనను ప్రవర్తింపనేరడు. నీ ప్రయోజననే నీ జీవితమునకు మెరుగుతెచ్చును. సుఖమిచ్చును. ప్రయోజనములేని జీవితము పశుజీవితము.

నీ వృత్తితోపాటు నీవు కల్పించుకొను నీయభిమాన విద్య నీ కలసటకలిగినపుడెల్ల క్రొత్తదనమును, విశ్రాంతిని ప్రసాదించును. నీజీవితమును మార్చివేయును. అదియే నీ జీవితమునకు పునాదిగకూడ పరిణమింపవచ్చును.

"కొద్దిమంది పుట్టుకలోనే గొప్పవారుగ పుట్టవచ్చును. ఇంక కొంతమంది ఇతరులద్వారా గొప్పవారుకానచ్చును. కాని

నూటికి తొంబైమంది గొప్పవారు తమ స్వశక్తిచేతనే గొప్ప వారగుచుండుట జగద్విదితము." ఇది యొక మహావాక్యము. నిక్కమైనవాక్యము. నీగొప్పతనము నీ చేతిలోనే కలదు. అది యింకొకరు నీకు ప్రసాదించువరము కాదు. దీనికి మహాత్ముని జీవితమే చక్కనితార్కాణము. నీ ప్రయోజనగరిమనుబట్టియే నీ కృషి యేర్పడును. నీ పుట్టుక ప్రయోజనరహితమైనదికాదు. దానిప్రయోజన మెద్దియో తెలిసికొని దానిని నెరవేర్చుటకే కంకణముకట్టుకొనుము.

నీ ప్రయోజనములలో నవస్థాభేదము లుండవచ్చును. ఒక్కొక్కకాలములో నొక్కొక్కయవస్థలో నొక్కొక్క ప్రయోజనముండును. అది తీరినవెనుక మరియొక ప్రయోజన మేర్పడవచ్చును. ఏకాలములో సంపాదింపవలసిన ప్రయోజనము నాకాలములో సంపాదింపనిచో జీవితము కుంటుపడును.

ఆరోగ్య మొక ప్రయోజనము. విద్యను సంపాదించు టింకొక ప్రయోజనము. ఈ రెంటిని బాల్యమునందే సంపాదింప వలయును. ఈ యవస్థలో సంపాదింపక చేయిజారవిడిచినచో వీటిని కూడదీసికొనుట కష్టము.

ధనము సంపాదించుటొక ప్రయోజనము. దానము, ధర్మము, పుణ్యము, జ్ఞానము యిత్యాదులన్నియు ప్రయో జనములే. ఈ యన్నింటిని మించిన ప్రయోజన మింకొకటి కలదు. అది తుదిప్రయోజనము. దానినే మొదటిప్రయోజన మనినను యనవచ్చును. తనను తాను తెలిసికొనుట ప్రయో జనములలోనెకెల్ల ప్రయోజనము. ఇది నెరవేరినకాని జీవితము పూర్తియగుటలేదు; శాశ్వత సుఖశాంతు లేర్పడుటలేదు.

# శరీరప్రభావము

ఈ మానవయంత్రములో శరీరమొకభాగము; చాల ముఖ్యమైనభాగము. అదియే సమస్తము ననుకొనునట్లు నూటికి తొంబైతొమ్మండుగురిమీద ప్రభావముకలభాగము. శరీర మనస్సులకుగల సంబంధసంపర్కములను విడదీయుటకు వీలు లేనంతటి ముఖ్యమైనభాగము. ఏపనిచేయుటకైనను శరీరమే యుపకరణము.

కనుక జీవితసంరంభములో నీవు దీనినెట్లు మరువగలవు? ఎట్లు నిర్లక్ష్యము చేయగలవు? అది తగనిపని; అసాధ్యమైనపని. మనశ్శరీరము లన్యోన్యప్రభావముకలవి. లోపలనుండి శరీరమును నడపునది మనస్సేయైనను, మనస్సుమీద, మనోవికారముల మీధ శరీరమునకుగూడ కొంత ప్రభావమున్నది. శరీరభావ మునే జయించినవారు లేకపోలేదు. కాని సామాన్య మానవుని ప్రస్తావనయే మన మిక్కడ చర్చించుచున్నాము.

ఒకడు యేడ్వ ప్రారంభించును. ఏడ్చినకొలది యది యెక్కువగుచుండును. ఏడ్చుచుండుటచే విచారము హెచ్చు చున్నదా? విచారముమూలమున యేడ్వ ప్రారంభమైనదా? రెండును జరుగుచున్నవి. మనము పారిపోవుచుందుము. భయము కలుగుటచే పారిపోవుట మొదలిడితిమా లేక పారిపోవుచుండు టచే భయముకలుగుచున్నదా? లేక రెండును యేకకాలమందే సంభవించినవా?

ఈ ప్రశ్నలు చొప్పదంటుప్రశ్నలవలె కాన్పింపచ వచ్చును. ఎంత పేలవముగా తోచినను వీటికి కొంత యాస్కా- రము లేకపోలేదు. నూటికేకొద్దిమందియో తప్ప తక్కిన వారందరు శరీరప్రధానులు. శరీరమాత్రులు. శరీరజీవులు. అనగా మనస్సును చక్కగా శిక్షించి మనసా ముందుగనే యోచించి పనిచేయువారుకారు. వారి శరీరచేష్టలు ముందు తరువాత మనస్సు నడుచుచుండును.

ఏదియో కొద్దివికారము పొడసూపినచో చతికిలపడి, తలపట్టుకొని, దిగాలుపడిపోవువారిని వెంటనే విచారభావము లలముకొనుటలేదా? కొద్దినష్టమో, కష్టమో, పొరపాటో జరుగుసరికి కొంపమునిగినట్లు నేలమీదపడి దొర్లుచు రొమ్ములు బాదుకొనుచుండువారి కంతట దుఃఖమే కాన్పించుటలేదా? పొరపాటుపడని జీవితముకలవాడున్నాడా? ఒకమిత్రుడు కొద్ది పొరపాటుచే కలిగిన నష్టమునకు – అనగా తనకివ్వవలసినవా రిత్తురని, తన కుమారున కుద్యోగము వచ్చితీరునని యనుకొని యొక కార్యమును తలపెట్టగా తను అనుకొన్న రెండుపనులు జరుగకపోగా – యీ కష్టమునకు తాళలేక, మతిచెడగొట్టు కొని, తిండితినుటమాని, మందుమాకులు వేసికొనుట నిరాక రించి బలనంత నిరాహారియై క్రమముగ దిగజారి యసువులు కోల్పోయినాడు.

హావము భావమును ప్రకటించుటయేగాక ప్రకోపింప జేయుచుండును. శృంగారచేష్టలు ప్రారంభమగుటతోడనే శృంగారభావములు బలుపుచెందుచున్నవి. శరీరవికృతికూడ మనోవికారములకు పుష్టినిచ్చుచుండును. కనుక విచారము,

దిగులు, ప్రమాదములు సంభవించినపు డొక్క నవ్వు నవ్వి, వెన్ను విరిచి, రొమ్ము పూరించి సుఖావహమగు కార్యమును దేనినో ప్రారంభించినచో నది పటాపంచలగుటలేదా? పౌరుషమును ప్రయోగింపుము. శరీరసాధనవలన మనస్సుకూడ ఆరోగ్యవంతమగును. శరీరవికారమును విరుచుటకు మనస్సుతోను, మనోవికారమును విరుచుటకు శరీరముతోను పనిచేయుట ప్రారంభించినచో దుఃఖమునకు, నపజయమునకు భయపడనక్కరలేదు. తోటపని, కట్టెలుకొట్టుట, నడిగనడచుట, గ్రంథపఠనము చేయుట, చేసిన యేపనినైన నను నుల్లాసముగ, ఫుల్లారవింద శోభతో చేయుట - యింతకంటె గొప్పమందులు, మంత్రములు లేవు. ఈ గ్రంథములో సూచించినవిధమున నడచువారికి సాధారణముగ నిట్టివేవియు నవసరము లేదు.

'వికారహేతౌ సతివిక్రియంతే యేషాం నచేతాంసిత ఏవ ధీరాః' వికారాదులకు తగుహేతువులు కలిగినప్పటికి నెవరి మనస్సులు దుష్టవికారములను దరికి చేరనీయరో వారే ధీరులు. ధీరత్వము నీలోనే యున్నది.

నీ శరీరమును బంటివలె నుపయోగించుము. మనస్సు కేమాత్రము కించకలిగినను దాని నుత్సాహపరచు చేష్టలు చేయుము. మనస్సుకూడ శరీరశాసనములను శిరసావహించుచునే యుండును.

మానసికవికారములకు తావీయని శరీరమే యారోగ్యవంతమైనశరీరము. న్యాయమైనపని నిశ్చయించుకొని చకచక చేసికొనిపోవువాని కెట్టి విచారములకు సావకాశమే యుండదు. లేనిపోని వికారములకు చోటిచ్చుటయే పెద్దవ్యాధి.

నూరు యుపన్యాసములిచ్చుటకంటె నొకపని చేయు టయే మేలు. 'చరిత్రలో వన్నె కెక్కగల పనినైనను చేయుము. లేదా క్రియార్హమైన విషయములను గురించి వ్రాయనైనను వ్రాయుము.' అని పెద్దలు చెప్పుదురు. ఇట్టి జీవితములను గడప గలవారే సుశ్లోకులు, అమరజీవులు కాగలరు.

# భయము

తే॥ శోక భయకారణంబులు లోకమున న
నేకములు దానఁ దలనూపు శోకములకు
భయములకు బుద్ధి నెడ యీడు పండితుండు
మూఢు డవి త్రోయనేరండు మునుగు వగల — భార.

శోకమునకు, భయమునకు నీలోకములో కారణము లనేకములు వాటంతటవియే తలయెత్తుచుండును. బుద్ధిమంతుడు వాటికి చోటీయడు. అవివేకి వాటిని త్రోయనేరక చింతలపాలై క్రుక్కుచుండునని పైపద్యము చాటుచున్నది.

పైకి కంటికి కన్పించునది మాత్రమే మానవయంత్రము కాదని గ్రహింపగలిగితిమికదా! కన్పించు నీ భౌతికశరీరము వెనుక భావశక్తి యొకటి కలదు. కనిపించని వినిపించని యీ శక్తియొక్క ప్రభావ మతి గొప్పది. గొప్పగొప్ప విషయము లన్నియు తెరచాటున తెలియబడకుండ నెట్టిప్రకటనలు లేకుండ జరుగుట ప్రకృతిరహస్యము.

నీ భావయంత్రములో నీకు తెలియకుండ సృష్టియగు చుండు భావములే క్రియారూపము దాల్చుచున్నవి. ఘనీభవించు చున్నవి. భావనే క్రియయగుచున్నది. మన మానసిక జీవితము మన పరిసరములకు తగినట్లు నడచుకొనుశక్తిని మనకు ప్రసా దించును. బుద్ధిని చక్కగాశిక్షించి, భావములను చిందరవందరగ పోనీయక వశమునందుంచుకొనువా డెట్టి పరిస్థితులలోను తబ్బిబ్బుకాక నిబ్బరముగ నుండగలడు.

రక్తము మనశరీరమునకు పుష్టినిచ్చుచున్నది. ఆరోగ్య భాగ్యము జీర్ణశక్తిని ప్రసాదించుచున్నది. ఆ రక్తనే చెడి పోయినపుడు రోగమును వ్యాపింపజేయుచున్నది. అట్లే భావనా శక్తికూడ మానవయంత్రములో తయారగు నన్ని యితరరసముల వలెనే యమృతరసమును చిలకవచ్చును. లేదా విషమును కక్క వచ్చును. నీమనస్సు నీగుప్పెటలో నుండి, నీ యాజ్ఞానువర్తియై మెలగినచో నీ జీవితము రసవంతము కాగలదు. ప్రజ్ఞావంతము కాగలదు. అమృతమయము కాగలదు.

మనస్సు నీవశము తప్పి నీభావములు లేనిపోని భయము లకు తావిచ్చినపు డది యొక యనర్థకర్మ నాచరించుచున్నది. హృదయములో విషమూలికను పెంచుచున్నది. భయమనగా నేమి? ఏ భయమైనను నూహాజనకమే కాని దానికిని నిజమైన యాధారములుండ నేయుండవు. అయినను భయమనగా నేటి యో ముందు నిర్వచించి చూడరాదా! దానిని నిలువున చీల్చి చూడుము. రానిదానిని గురించి, జరుగనిదానిని గురించి లేదా యేదో వచ్చిపడునని మనము చేయు యూహాగానమే భయము. దాని కేల తావీయవలెను?

ఒకడు తనపనిని ముందుగనే నిర్ణయించుకొనును. నిర్ణయించుకొనుటే తడవుగ పనిలోనికి చొరబడును. మనస్సు పనిలో లీనమైపోవునేగాని యటునిటు తొంగిచూడదు. అట్లు చూచుటకు దాని కవకాశమే లేదు. అట్టివానికి విఘ్నములు కలుగవు. కలిగినా వాని నత డవలీలగా దాటగలడు.

కార్యము తలపెట్టకమునుపే విఘ్నములనే ముందు సంభావించువారు కలరు. అవి వారిమానసిక యంత్రమునుండి పుట్టుచుండు శూన్యరోగములు. అవి వారికొక్కరికే కాన్పించుచు మరెవ్వరికిని దృగ్గోచరముకావు.

నిజముముందు భయములు నిలువజాలవు. భయము పిరికిలక్షణము. ప్రయత్నహీనులలక్షణము. ప్రయత్నమున్న చోట దానికి తావులేదు. ఈ భయకంకాళమునుచూచి భయపడుటచేతనే దానికి ప్రాణప్రతిష్ఠ జరుగుచున్నది. దానిని నీవే చేయుచున్నావు.

నీ లోపములను సవరించుకొనుచు, నీపట్ల, యితరుల పట్ల నిజాయితిగ వర్తించుచు, నీలో నకిలీ యెంతమాత్రము లేకుండచేసికొనుచో నీ వెవ్వరికి భయపడవలెను? ఎందుకు భయపడవలెను?

'అభయమే యీశ్వరరూపము' అని వివేకానందస్వామి వచించిన దివ్యవాణిని జ్ఞప్తికితెచ్చుకొమ్ము. 'మాభీః' భయపడకుము. దీనినే గీతకూడ దైవీసంపత్తుగ వర్ణించియున్నది. 'భవిష్యం నానుసంధత్తేనాతీతం చింతయత్యసౌ, వర్తమాన నిమేషంతు హసన్నేవానువర్తతే॥'

రాబోవుదానినిగురించి తలపోయడు. గతించినదాని కొరకు చింతింపడు. వర్తమాన నిమిషమందు మాత్ర మతి యుల్లాసపూర్వకముగ ప్రవర్తించుచుండును. గతించినదా జారి పోయినది. రాబోవునది నీదికాదు. ఇక వర్తమానమొక్కటే నీది. దానిని పూర్తిగ, హృదయపూర్వకముగ నాహ్వానము చేయుము. అనుభవింపుము. జీవితపరమార్థమున కిదియే మార్గము.

# ధైర్యము

'భజ ధృతిం త్యజ భీతి మహేతుకాం.'

ధైర్యమువహింపుము. కారణములేనిభీతులను విడిచి పెట్టుము. భయములన్నియు కారణములేనివనియు యదార్థ మను జ్యోతిముందర నవి పలాయనమగుననియు మనము తెలిసికొంటిమి. అవి మనము తెచ్చిపెట్టుకొను పిచ్చియూహలు.

'నేను భయరహితుడను. నా కెట్టిభయములు లేవు' అని గర్జించువాని నేభయములు బాధింపనేరవు. నీ యూహ్వానము నంగీకరించియేవి యవి నీచెంతచేరుచున్నవి. ధైర్యమే భయమునకు విరుగుడు.

ఆత్మవిశ్వాసములేనివారినే భయమావహించును. అట్టి వారు మానవత్వమునే కోల్పోవుచున్నారు. విశ్వాసముకల వారు జీవితసౌరభము నాస్వాదింతురు. గుణమునారాధింతురు.

క్రియావంతులగుదురు. అడ్డనునదిలేకుండ ముందుకు పోవు చుందురు. వారొకరికడ్డురారు. ఒకరియడ్డులకు భయపడరు.

విశ్వాసములేనివారు విషాదులు. వారు సర్వత్ర నలుపే కాని తెలుపు చూడజాలరు. వారిజీవితము భారమయము చేసి కొనుచు నితరులకుకూడ భారమగుదురు. వీరి కంతట చీకటి యవగుణము కన్పించును. కాని జ్ఞానము, గుణము, ప్రకాశము కానరావు.

చాలమందికి తమశక్తి యెంతటిదో తెలియదు. తరచు మనమందరము మనసమర్థతలను గుర్తింపము. ఇక నెదుటివాని సమర్థత నసలే గుర్తింపము. మనలను కొంచెపరచుకొనుచు నితరుల నంతకంటె నెక్కువగ కొంచెపరుతుము. ఈ ప్రపంచము నకు మనవలనకూడ నొకప్రయోజనముకలదని గుర్తింపకపోవుట మహాదోషము. ప్రయోజనములేని వస్తువేదియు నీప్రపంచము లోనికివచ్చుటలేదు. ప్రయోజనముతీరినతరువాత యుండుటలేదు.

కనుక నాత్మదూషణ పనికిరాదు; న్యాయముకాదు. అవిశ్వాసమే పిరికితనమునకు కారణము. 'ఆత్మవిశ్వాసముగల నేను చేయజాలనిదేమున్నది?' అను తత్త్వవిచారణ, ఆచరణము యిపుడు కావలయును. ఇది విస్తరించినకొలది భయము పలచనైపోవును. కరడుకట్టినయజ్ఞానము కరగిపోవును.

కాని నీ వాక్యములపట్ల, నీ భావములపట్ల, నీపట్ల నీకు శ్రద్ధ, నిజాయితి యుండితీరవలెను. నిజాయితిలేని కపటనాటక మెంతమాత్రము పనికిరాదు. కపటికి ధైర్యమబ్బదు. మేక పోతుగాంభీర్యమువలన లాభములేదు. జీవితములో నీ కొక

స్థానముకలదని విశ్వసింపుము. నీ మనస్సు నీ నిజస్థానమును చరితార్థముచేయు మంత్రక్రియాశక్తులపై కేంద్రీకరించునుగాక.

ధైర్యము మానవలక్షణము. ధైర్యముచిక్కినకొలది భయము దానంతటదియే కరగిపోవును. భయము బానిసలక్షణము. కనుకనే బానిసత్వము నెన్నడు నంగీకరింపరాదు. అభయమే నీ కవచమగుగాక.

'అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః' అని భగవద్గీతలో వర్ణించిన దైవీసంపదను నిత్యము నారాధించి చూడుము. భయములేకపోవుట, పరిశుద్ధమైన, నిష్కళంకమైన బలసంపద, జ్ఞానగర్భితమైన స్థిరశక్తి-ఇవి నీ జన్మహక్కులు. ఇవియే నీవు. వీటిని పోగొట్టుకొనుట నీ స్వయంకృతాపరాధము. నీవెట్లు పోగొట్టుకొంటివో యట్లే నీ స్వప్రయత్నముచేతనే నీవు వీనిని తిరిగి సంపాదించుకొనవలయును. ఇవి నీలోనున్నవే కనుక నీ ప్రయత్నముచే తిరిగి లభ్యమగును. దేనినైనను పోగొట్టుకొనువాడు తాకరివంతు సంపాదించిపెట్టుటకొకరివంతు కాజాలదు. ఇతరులు సంపాదించినది చివరవరకు నీకుండజాలదు. ఇంకొకడు సంపాదించుకొనిన యారోగ్యముకాని, జీర్ణశక్తి కాని మనకు సంక్రమించుటలేదే.

ధైర్యమే యెట్టిసంకటములనైనను తరింపచేయగల తెప్ప. ధైర్యలక్ష్మి నెప్పట్టునను వీడరాదు. వలయువస్తు వెంత వగచినను రాదు. ప్రయత్నమున సమస్తమును చేకూరును. ప్రయత్నించి నను రానిదానికొరకు వగచి లాభములేదు. దానివలన మనశ్శరీరములు తాపసంతప్తమగుటతప్ప మరియొకలాభము చేకూరదు.

కం॥ ధృతి యారోగ్యము నొసగును, ధృతి యుజ్జ్వలలక్ష్మి

దెచ్చు కీర్తి సమున్నతిజేయు గాలగత్యవగతి గలిగిన గలుగు ధృతివికారవిదూరా. ధైర్య మారోగ్యలక్ష్మిని, యుజ్వలమైన ధనలక్ష్మిని, సమున్నతకీర్తిభాగ్యమును ప్రసాదించునని యెల్ల కాలములయందు ధృతినివిడువరాదని పైపద్యముచాటుచున్నది.

# మానవుని యల్పత్వము

'మానవుడు' ఒక వింతజీవి. 'ఆత్మవిచారము' లేక 'నాలోచన'యను 'వింతశక్తి'కల జీవి. 'ఈ సృష్టికంతకు మానవుడు మకుటమువంటివాడు.' 'కప్పులేనియిల్లు మానవుడులేని సృష్టి యసంపూర్తి కార్యములు.' అని యొక కవి రసవత్తరముగ వర్ణించినాడు.

'మానవు డాత్మసాక్షాత్కారము చేసికొనగల స్తవనీయమూర్తి' యని, మహాకవి షేక్స్పియ రుద్ఘాటించినాడు. మనఋషులును ఎన్నడో దీనినే చాటినారు.

అవును. ఇది పరమసత్యము. కాని యతనిమహిమను కనుగొనుటకుపూర్వ మతనియల్పత్వమునుకూడ కొంతవరకు విచారింతము. మానవుని స్థూలరూపమును, శరీరసంపదను, భౌతిక నిర్మాణమును పరీక్షింతుమేని యతని యల్పత్వము బయటపడును.

అశ్వముయొక్క రయము, బలసౌష్టవములు, గజరాజుయొక్క ఘీంకార, ఝాంకార, స్థౌల్య, ఔన్నత్యములు,

మృగేంద్రుని పరాక్రమము, శివి,నృష భేంద్రునిసొగసు, ఇంద్రనీల రోచులతో చమత్కరించు బర్హిబర్హనాట్యసరళి, నూరుగురు నూర్జహానులకైన నెనలేని రాచిలుక మృదుమధురవర్ణ సౌరు, నాగస్వరగానముగ్ధయై విపార్చిన సర్పముతో నాట్యమాడు నాగుని యందము, 'ఆకాశపాంథుడగు' ఖగరాజు స్వేచ్ఛా విహారము – ఇట్లెన్నని వర్ణింపగలము. వీటిముందర మానవ శరీరముయొక్క యందచందములు, హొయలు యేలెక్కకు వచ్చును? అవి వీటిముందర కొరమాలినవి. అందవికారమైనవి. ఈ దృష్టిలో మానవుడొక మరుగుజ్జువాడనక తప్పదు. 'తరచు మానవులందరిముఖములు తేజోవిహీనముగ నుండును' అని స్పెన్సరు నుడువుచున్నాడు.కనుక స్థూలశరీరరీత్యా మానవు డితరజంతువులకంటె నందవిహీనుడని, దుర్బలుడని విదిత మగుచున్నది. ఏ జంతువునకు లేని రోగములన్నియు నితనికే దాపురించుచున్నవి. నేటిమానవుడు రోగములకుప్ప.

ఇక మానవుని రాగద్వేషములను, మనోవికారములను పరిశీలింతుమా – ఈ రంగములో నతడు తరుచు పశువులకంటె చాల నికృష్టుడని చెప్పకతప్పదు. పెద్దపులి, సింహము, యెలుగు, తోడేలు మొదలగు క్రూరజంతువుల కొకహద్దు, మితి కలదు. అవి తమ యాకలితీరినవెనుక నికచంపవు. కొన్నిజంతువులు కొన్నిటినిమాత్రమే చంపును. జంతువులు సాధారణముగ పక్షులజోలికిపోవు.

కాని మానవుడో! చీమ మొదలు సమస్త జీవరాసులకు నతడపకారముచేయుచుండును. చివరకు దాయాది (అనగా బంధువు) అను శబ్దమునకు శత్రువు అను నర్థము మానవ

జాతిలోనే నామాంతరమగుచున్నది. పశుపక్ష్యాదుల కీ యర్థము వర్తింపదు.

చీమ, తేనెటీగ, సాలెపురుగు, గోవు, కుక్క, కపోతము, కుళింగపక్షి, చక్రవాకము మొదలగునవి మానవున కనేక పాఠములు నిత్యము నేర్పుచున్నవి. మానవునిస్వార్థము, అహంకారము, క్రౌర్యము, పొగరుమోతుతనము దయ్యములనుకూడ మరపింపగలవు. ఇవన్నియు కరుడుగట్టి మానవునిలోనే మూర్తీభవించినవి.

'ఓ హేమంతవాతమా! విసరుము! మరింత జోరుగ విసరుము! మానవకృతఘ్నతలో నున్నంత కౌర్యము నీలో కాన్పించుటలేదు! అని యొక కవి వాపోయినాడు. మానవ కౌర్యమున కింతవర కీ ప్రపంచములో ప్రవహించిన మానవరక్త ప్రవాహములే సాక్ష్యము. ఇక నేటి నాగరిక ప్రపంచములో దీనికి మరింత హద్దులేకయున్నది.

ప్రజలు శాంతచిత్తులై యున్నచో ప్రపంచములోని సగము దోషములు నశించును.' అని పాస్కల్ అను రసాయనశాస్త్రజ్ఞుడు వెలిబుచ్చెను. కాని మానవులు పశువుల కన్న 'గొప్పవారు' కనుక పెద్దపులికన్న క్రౌర్యము, ఏనుగు యొక్క పగ, సింహముయొక్క కోపము, సర్పములోని విషము, నక్కకున్న జిత్తులు, అడవిపంది దుస్స్వభావము – ఇట్టివెన్నియో కరడుగట్టి మానవునిమనస్సులో నాట్యమాడు చున్నవి.

ఇంతేకాదు. ఈ మానవ'జంతువు' అల్పజంతువు లనబడువాటిని మించిన దుర్మార్గముల కొడిగట్టుచున్నాడు.

అమెరికా, రష్యా, జర్మనీ, యింగ్లండు, ఫ్రాన్సు, యిటలీ మొదలగు సభ్యజాతులనబడువారిమధ్య జరుగుచున్న హాత్యాకాండ ఆయా దేశములలో నున్న జంతువులమధ్య జరుగుటలేదేమి ? ఈ దేశములలోనున్న మానవుల కున్నంతనాగరికత వాటికి లేక పోవుటయే దీనికికారణమా? రాగద్వేషములు మానవునిచే నెంతటి పనినైనను చేయించును.

బుద్ధిచే మానవు డితర జంతువులకంటె గొప్పవాడు. నిజము. ఇదియే యతనిని రక్షించుదిక్కు. కాని ప్రతిమానవునకు బుద్ధికలదుకదా. సృష్ట్యాదినుండి నేటివరకు పుట్టిపెరిగిన మానవారణ్యములో పేర్కొనదగిన బుద్ధిమంతు లెంతమంది కలరు ? బహుఅరుదు. వారిని గోళ్ళమీద లెక్కింపవచ్చును. కారణము?

మానవబుద్ధి యింద్రియాధీనము, రాగద్వేషగ్రస్తమునై యతనిని రక్షించుటకుబదులు కొట్టికొట్టి నేలమట్టము చేయుచున్నది. చాలమంది తమబుద్ధిని కడుపుకక్కుర్తికి విని యోగించుచున్నారు. 'ప్రస్తుతన్యాయవాదవృత్తి, వర్తకము సంఘమునకు మేలుకంటె హానియే యెక్కువ చేయుచున్నవి.' మనము పర్వతములను పిండికొట్టవచ్చును. నేలను చాపచుట్టినట్లు చుట్టవచ్చును. సూర్యునితూచవచ్చును. విద్యుత్తును వెల్లువగా ప్రవహింపజేయవచ్చును. ఆకాశమును వర్తకగృహముగ మార్చవచ్చును. ఇట్టిపనులు నేడెన్నియో నిత్యము జరుగుచునే యున్నవి. బుద్ధి నెంతపెంచినను పెంచవచ్చును.

ఎంతచేసినను 'సృష్టిరహస్యము తెలియశక్యముకానిది' అని కేంటుమహాశయుడు చెప్పినట్లు చివర కొక్క నీటిబిందువు తుద, మొదలుకూడ బుద్ధికిదొరకుటలేదే! ఈ బిందువు ప్రాణ

వాయువు, ఉదజని కలసిన సమ్మేళనమనియు, నీ వాయువులు సూక్ష్మజీవరాసులనియు, నవి చైతన్యకేంద్రములనియు, నవి యద్భుతసామరస్యముతో పనిచేయు శక్తికేంద్రములని, జ్యోతిష్కణములని చివరకు పదార్థముకాని యొకశక్తియని చెప్పబడుచున్నది. చివర కది యిట్టిదని నిర్వచింపరాని యొక మూర్తి యని యందరు నొప్పుకొనక దప్పినదికాదు.

కనుక బుద్ధిరీత్యా చూచినను మన కోటమియే సంభవించుచున్నది. 'నాకేమియు తెలియదు' అని మన మెప్పుడో యొకప్పు డనక తప్పుటలేదు. మనబుద్ధి కొంతదూరమే పోగలదు. ఎంతదూరమో యనసక్కరలేదు. శరీరములోని సూక్ష్మాతిసూక్ష్మములైన నాడులవ్యాపారము, ప్రాణవాయువు రాకపోక, యది యెప్పు డెందుల కెచ్చట నాగిపోవునో, యెట్లు ప్రారంభమయ్యెనో చెప్పగలవా రిప్పటికిని లేరుకదా! కనుక మానవుని బుద్ధికూడ నల్పమైనదే. అది యతిపరిమితమైనదని మనకు రుజువగుచున్నది.

# మానవుని మహత్త్వము

మానవునిబుద్ధిపోవువరకు, నది పెరిగినకొలది దాని యల్పత్వమే విశదమగుచువచ్చినట్లు మనము చూచితిమి.

శరీరముకంటె నింద్రియములు గొప్పవి. ఇంద్రియములకంటె మనస్సు గొప్పది. దానికంటె బుద్ధి గొప్పది. దానికంటె

గొప్పది. 'సః' అనగా పురుషుడు; ఆత్మ' యని గీత స్పష్టీకరించెను.

బుద్ధియొక్క యావరణను దాటి భావాతీత జగత్తులోనికి పోయినపుడే మానవునిమహత్త్వము ద్యోతకమగుచున్నది. ఇది మానవునికే ప్రసాదింపబడినది. దీని నతడు నిర్వచింపలేకపోవచ్చును. వర్ణింపలేకపోవచ్చును. కాని యనుభవింపవచ్చును. అనుభవించున్నాడు. కంటికికన్పించువస్తువును, చూడబడుదానిని నీవు వర్ణింపగలవు. కాని యనుభవైకవేద్యమగుదానిని నీ వెట్లు వర్ణింపగలవు? కనుక న్యూటను తత్త్వవేత్త 'నే నిసుకను గర్జించుచున్న జ్ఞానసముద్రతీరమున మాత్రమే యాటలాడుచున్నాను' అని భావగర్భితముగ పల్కినాడు. మానవుడు కించిజ్జ్ఞుడని యతడు రుజువుచేసెను. మనస్సుచే నూహించుట, నోటితో కీర్తించుట, స్వయముగ ననుభవించుట, యైక్యమగుట – ఇవి మానవుని జన్మహక్కులు. నిజసత్త్వములు. నిజము నూహించుట, యనుభవించుట నిజమేయైపోవుట మానవునకుగల విశిష్టత. పశువుల కిది యందని విషయము.

ఈ తత్త్వమును గ్రహించి యనుభవించిన మానవుడే మానవుడు. అట్టివాడు బ్రహ్మానందము ననుభవించును. అందులో లీనమైపోవును. చివర కదియేయైపోవును. బ్రహ్మానందమే మానవుని గమ్యము. పట్టరానియానందమేదేని కలిగినపుడు 'బ్రహ్మానందము నొందితిని' అని ప్రతివాడు ననుచుండును. దానికొరకే సృష్టినిర్మాణము జరిగెను. ఆ యానందము దొరకువరకు, దాని ననుభవించువరకు నీ ప్రయాణము జరుగుచుండును.

శ్లో॥ అహమస్మి పరశ్చాస్మి బ్రహ్మాస్మి ప్రభవోస్మ్యహం।
సర్వలోక గురుశ్చాస్మి సర్వలోకోస్మి సోస్మ్యహం॥

"నాకు నేనై యున్నాను. నేను యితరుడనుకూడనై యున్నాను. నేను బ్రహ్మనై యున్నాను. నేను సృష్టికర్తను. నేను విశ్వగురువును. నేను సర్వప్రపంచమును. నేను ఆత్మను."

ఈ యాత్మ లోకములో మానవుడు పుట్టుక, చావు, మార్పు లేనివాడై యమరత్వము నొందుచున్నాడు. అతనిని కత్తి కోయజాలదు. నీరు తడుపజాలదు. వాయువు శోషింప చేయజాలదు. ఇట్టి యసమాన మానవసౌఖ్యమును, తేజస్సును వెర్రిమానవుడు విషయసుఖములకొరకు, కుక్షింభరత్వము కొరకు అమ్మివేయుచున్నాడు.

మనమెవరమో మన మెరుగము. మనలోనున్న మూల శక్తిని, యీ యల్పశరీరచట్రములో బిగింపబడిన నిగూఢనిధిని గురించి యోచింపనైన యోచింపము. శాశ్వతానందమును నిరంతరము నిరాతంకముగ ననుభవింపవలెననియే జీవిత శాస్త్రము చెప్పుచున్నది. దీనినే వేదాంతశాస్త్రమందురు. ఇదియే యథార్థశాస్త్రము. ఇది యనుభవమునకు విరుద్ధమైన శాస్త్రము కాదు.

ఈ యంత్రయుగములో మానవులు యంత్రసుఖముల కొరకు, పదార్థభోగములకొరకు, విలాసవిహారములకొరకు, సముద్రములుదాటి, పర్వతములెక్కి, యాకాశములోని కెగిరి చుట్టిచుట్టి తిరిగి తిరిగి విరిగిముక్కలై ప్రపంచమును భోగమయ ముచేయ గోరి రోగమయముచేసి నిరంతరదుఃఖములకు లోన గుచు నరకప్రపంచమునే మనకు సమర్పించుచున్నారు.

ఈ విచిత్రమానవయంత్రము, ఈ యద్భుతయంత్రము మాత్రమే పొందగల యానందరసమును మూడుదమ్మిడీల కమ్మి వేసి ప్రపంచమంతయు తిరిగివచ్చి డిల్లి పోవుటే యీ యుగ ధర్మముగ కన్పించుచున్నది.

నిజమే, మన బుద్ధికోశమునుకూడ దాటిన తరువాతనే మానవునిమహాత్త్వము సాధింపబడుచున్నది. బుద్ధినిదాటనంత వరకు నతడు పరిమితులలోనే నిలిచి, క్లేశకోశములను ననుభవింపక తప్పదు. ఈ స్థితి పొందువరకు నేదో యొక సమస్య మానవు లను వేధించుచునే యుండును.

బ్రహ్మాత్వమే మానవుని పరమావధి. అదియే యతనిలో నున్న గొప్ప. తక్కిన గొప్పలన్నియు శ్మశానమువరకైనను పోవునవికావు.

# ఆత్మజ్ఞానము

ఆత్మజ్ఞాన మమోఘమైనది. పటుతరమైనది. ఇదియే మన పరమావధి. ఆత్మజ్ఞానమనగా తనను గురించిన తెలివి. ఇతరులనుగురించి గంపెడు తెలిసికొనుటకంటె మనలనుగురించి యావంతయైనను తెలిసికొనుట మేలు. శరీరమునకు ప్రాణ మెట్టిదో మానవున కాత్మజ్ఞాన మటువంటిది. దానికోకాని మానవజీవితమునకు విరామముండదు. సుఖముండదు. తనను గురించిన తెలివి యనగా శరీరము, మనస్సు, బుద్ధి, దానిపైది - యీ యన్నిటియొక్క జ్ఞానము. ఇవన్నియు గుర్తింపబడి, సమ న్వయపడినపుడే యాత్మజ్ఞానము కలుగును.

ఇట్టి యాత్మజ్ఞానముకలవారే చరితార్థులు. తక్కిన వారు 'జరఠగర్దభాః' ముసలిగాడిదలు అని వశిష్టుని ప్రవచనము కలదు. మనలనుగురించిన తెలివియే మన ప్రథమాశయము, ప్రధానాశయము కావలెను. ఆత్మజ్ఞానమున కాత్మవిశ్వాస ముండవలెను.

'భగవంతునిపై విశ్వాసముంచమని పూర్వమతములు చెప్పినవి. నీమీాదనే విశ్వాసముంచుకొనవలయునని యిప్పటి మతము చాటుచున్నది.' అని వివేకానందస్వామి యెలుగెత్తి చాటినాడు.

సంఘములోను, సంఘముతోను సుఖముగ ప్రవర్తింపజాలనివాడు తనశక్తిని గ్రహింపనివాడగుచున్నాడు. మన ప్రవర్తనకు సంబంధించిన న్యాయమొకటికలదు. తరచు దీనిని మనము మరచిపోవుచుందుము. మన కున్నదానిని, మనము గ్రహించిన దానిని తిరిగి మన మితరులకు దానముచేయుచుండవలయును. ఇది చండశాసనము. మనముపొందిన యనుభవమును, జ్ఞానమును, శక్తిని దాచిపెట్టరాదు. దాని నేదోవిధముగ నితరుల కందజేయవలెను. అట్లే తనకున్నదాని నితరులకు పెట్టకుండ తానే తినువాడు మానవజాతినుండి దిగజారిన వశువు. కుక్షింభరుడు, దొంగయని గీతచాటుచున్నది.

మనసును, విద్యనుకూడ దాచిపెట్టరాదు. వానిని దాచినచో మురుగుకాలువలే యగును. ఉదారభావములు, ఆశయములుగలిగి సరసముగ ప్రవహింపజేయవలసిన మనోవిద్యలను మూతపెట్టుట శోచనీయము. మొదట వీనిని సంపాదింపవలయును. సంపాదించినవాటిని పంచవలయును. ఇవి యిచ్చిన

కొలది, పంచినకొలది పెరుగుచుండును. విద్యార్థులు 'తరుచు లాగులు ధరించిన పుస్తకములు' అని మెకాలే యొకసారి వచించినాడు. చాలమంది మానవులు 'మీసాలుగల శిశువులు' అని రామతీర్థ చాటెను. అనుభవము, ప్రయోగము, ప్రవర్తన లేక నిత్యజీవితములకు సంబంధించని చదువు నిరర్థకము. కుక్కచర్మములో పోసిన గోక్షీరము వంటిదని యార్యులు చెప్పిరి.

"ప్రతి మస్తిష్కము పుస్తకముల చీకటికొట్టు. సదా పఠించుటే తప్ప నేర్చుకొనినది, నేర్చుకొనతగినది లేని జీర్ణారణ్యము" అని పోప్‌కవి వాపోయినాడు.

అజీర్ణరోగికి ప్రపంచమంతయు రోతగ వెగటుగ తోచును. మానసికాజీర్ణమంతకంటె నధ్వాన్నమైనది. మన రుగ్మతనే మనము ప్రపంచములో చూతుము. దాని కాపాదింతుము. మానసికరుగ్మత శరీరరుగ్మతకంటె యపాయ కరమైనది. చదివినదానిని శరీరమునకు పట్టించుకొనవలయును. ఆచరింపవలయును. సదాచారపరుడు కావలెను.

ఇతరులు నీవంటివారని,నీ వితరులవంటివాడవేయని గుర్తింపుము. నీ వొకనికంటెనధికుడవుకావు, నీచుడవుకావు. విద్యచేత, ధనముచేత, రూపముచేత, కులముచేత, వయస్సుచేత నీవు కోటిమందికంటె నధికుడవే యనుకొనుము. ఈయన్నిటియందు నీకంటె నధికులైనవారు కోటానుకోట్లు గలరే! ఇంతకు నీ రూపము, ధనము, విద్య యిత్యాదులు నీవుచూచుచుండగనే మాయమగుచున్నవికదా. ఇక నీవు దేనినిచూచి గర్వపడుట? నీ కింత నిక్కేల?

తెలివి యొక్క-టే నీతోనుండును. అందులోను నిన్ను గురించిన తెలివియే నీ కుపకరించును. ఇదియే నీకు సాయపడును. ఇతరులనుగురించిన తెలివి నీకు బరువుచేటు, నిరుపయోగము, శరీరాయాసకారణము.

ఇంతకు నిన్ను నీవే తెలిసికొనలేనివాడ వితరులను గురించి యేమి తెలిసికొనగలవు? అట్టిది నీ కేమిప్రయోజనము? దానివలన నీ వొక యంగుళమైనను ముందుకు పోగలవా?

నీకు శరీరమున్నది, మనస్సున్నది. ఈ రెంటిని మించి 'యివి రెండును నావి' యనున దొకటి యున్నది. ఈ మూటిని తెలిసికొనుటయే యాత్మజ్ఞానము. ఈ జ్ఞానములో నున్న సౌందర్య మెందులోను లేదు.

'క్షేత్రక్షేత్రజ్ఞయోః జ్ఞానం య త్తత్ జ్ఞానం మతం మమ' అని శ్రీకృష్ణుడు నుడివినాడు. అనగా నీలోనున్న అణువు మొదలు (స్థూలము) బ్రహ్మము (తెలివి) వరకుగల సమస్త శక్తులయొక్క- సమన్వయజ్ఞానము, అనుభవపూర్వకజ్ఞానము, హృదయగతమైనజ్ఞానము, దేని కెంతవిలువ నీయవలెనో యంతటి విలువనే యిచ్చు జానము జ్ఞానము కాని యనుభవమును యథార్థవిలువలను గుర్తెరుగని శుష్క-వాచికజ్ఞానము ఆత్మ జ్ఞానము కాజాలదని పై శ్లోకపాదము తెల్లముచేయుచున్నది.

'తనను తెలిసికొనుట సత్యము; తనతో పోరుసలుపుట శివము. తనను తాను జయించుట సుందరము' అని యొక భక్తుడు గానముచేసెను. ఆత్మవిజయము భక్తియగును కాని చిడతలు, తాళములు వాయించుటే భక్తి కాజాలదు.

# ముందుచూపు

ఎప్పుడును, అన్ని పరిస్థితులందును ముందుచూపే కలిగి యుండుము. గతమును విస్మరించుచు ముందుకుపోవుచుండుము. గతజలసేతుబంధనము దండుగపని. దుర్బలలక్షణము. గతించిన జంతువులను పూడ్చిపెట్టుటలేదా? అట్లే భూతవిషయములను త్రవ్వి త్రవ్వి యేడ్వరాదు, ఏడ్చిన ఫలము? శూన్యమే.

మనమందరము నేదోయొక ప్రమాదమునకు గురి కావచ్చును. తప్పులుచేయవచ్చును. చేయుచునేయుందుము. ఎంతటి ఘనులకైనను యివి తప్పవు. వ్యవహారచికాకులు, నష్టములు, మోసములు, వేసికొనినబాట చెడిపోవుట-ప్రతివానికి నివి సంభవించుచునేయుండును. ఒక స్నేహితుడు జీవించుటకు కావలసిన వసతులన్నిటిని కలిగి, సంఘములో పదిమందిచేత మన్ననలుపొంది విద్యాధికుడయి, యెంతకాలము జీవించినను లోటులేనంతటి ధనముసంపాదించియు గతప్రమాదములను వేటినో స్మరించుచు నాత్మహత్యచేసికొనిన బాగుండుననునంతటి యుద్వేగముతో బాధపడుచు రోజులను బహుభారముగగడుపుట నేమన వలెను? నిజమునకు నెట్టివానికైనను వెనుకకుచూచినకొలది వెనుకటిదంతయు తప్పులతడకవలెనే కన్పించును. ఏ వేవియో చేసి యుండినచో నెంతెంతయో కలిసివచ్చెడిది. నిజమే. కాని దాని కిపుడు రోదించిన లాభమేమి? ఇది యందరికిని వర్తించును. కారణమేమన నెవనికిని పూర్ణజ్ఞాన ముండనేరదు.

దుర్బలమనస్కుడు, అశిక్షితమనస్కుడు వీటిచే దిగాలు పడి కృంగిపోవును. మనోదండికలవాడు వెన్నువిరిచి, రొమ్ము

పూరించి, యొకనవ్వునవ్వి ముందుకుపోవుచుండును. ఇద్దరకును భేదమెక్కడకలదు? ఒకడు వెనుకకే చూచుచు నపజయములనే తలపోసికొనుచు మనస్సును వ్యర్థవిచారములతో నింపుచుండును. నిబ్బరమైనవాడు వాటిని పాతివేయును.

అతడు తనదృష్టిని భవిష్యత్తుమీదకు సారించి తను సాధింపవలసిన గమ్యమునుగురించియే కలలుగనును; విజయము నాకర్షించును. అతనికలలు నిజములగును. మొదటివాడు తిన యపజయముల నపజయముల క్రిందనే భావించి కూలబడును. రెండవవాడు వాటిని గుణపాఠములుగభావించి యా యనుభవముతో ముందుకుపోవుచుండును.

నీ భావముల నెన్నడు విచ్చలవిడిగ చెలరేగనీయకుము. చెలరేగినభావములు నీ యిచ్ఛాశక్తికి ప్రబలశత్రువులు. చక్కని భావములనే భావించుచు ముందుచూపు కలిగియుండుము. కటుకుదనము, చురుకుదనముగల భావములు శక్తివంతములు, క్రియావంతములు నగును.

నీ భవిష్యత్తును నీవే సృజించుకొనవలయును. అది నీ చేతిలోనిదే. నేలపాలైన పాలకొరకెంత ఏగచినను లాభమేమి? శిథిలదుర్గముల నధిష్ఠించి నీ వెంతతలపోసినను నవి నీకు రక్షణనీయకలవా? కాలిపోయినత్రాటితో నీవేమిచేయగలవు?

"అత్యంతకళ్యాణము నొనగూర్చునది యికముందే సంభవింపగలదు. జీవితములోని మొదటిరంగ మీ తుదిపర్యావసానముకొరకే యేర్పడెను" అని బ్రౌనింగుకవి గానముచేసెను.

ఇది యతి చక్కనిభావము; తియ్యతియ్యనిభావము. దుర్బలచేతస్కు లిట్టిభావములను తరచు జపించుచో నాత్మ

వంతులు కాగలరు. 'నా యమాత్మా బలహీనేన లభ్యః' ఈ యాత్మ బలహీనులచే పొందశక్యముకానిది. మన మనశ్శక్తు లను సామ్యావస్థలో నుంచుటయే మనము నేర్చుకొనవలసిన మొదటిపాఠము. మానసిక సమతయే జీవితమును సంతోష వంతముచేయు దివ్యౌషధము. నీవు దేనికి నుబ్బిపోనక్కర లేదు; కృంగికృశింపవలసిన పనియులేదు.

నీ సంకల్పశక్తిని నీ గుప్పెటలో నుంచుకొనుము. నీవొకపనిని చేయగలుగుటకంటె చేయకూడనిపనిని చేయ నిరాకరించుటకే సగము యుద్ధముచేయవలెను. తలయూపుట సులభము. కాని తలపంకించి నిరాకరించుట కష్టతరము. సంతోషస్వాంతుడగుటకంటె విషాదికాకుండ తిరస్కరించు టయే యెక్కువ కష్టము. మోహములో పడిపోవు టతి సుల భము. దానికి లొంగకపోవుటకే సమరముచేయవలెను.

ప్రతి జంతువుకు కండ్లు ముందుచూచుటకు వీలగునట్లే నిర్మింపబడినవి. కాని వెనుకనడకకొరకు సృజింపబడలేదు. బుద్ధి లేని జంతువులుకూడ వెనుకకు నడచుటలేదే, బుద్ధిగల మానవు డేల తిరోగమనము వాంఛింపవలయును?

చూ పెప్పుడు నున్నతస్థాయిలోను అభివృద్ధిమార్గము లోను నుండుకొరకే కన్నులుత్తమాంగములో నమర్చబడినవి. లేనిచో నవి యే పృష్ఠభాగములోనో, చీలమండలోనో యుండెడివేమొ! ముందుచూపులేని మందజీవితము మందులేని వ్యాధివంటిది. అభివృద్ధి, యున్నతి, యుదారత, సరసత ముందు చూపులో నున్నవి.

జీవితములో నొకచోటనాగిపోవుటయు పనికిరాదు. ఆగి పోవువారు, వెనుకచూపువారు వెనుక వెనుకకు పోవలసినవారే. దీనికి ధర్మరాజుచేసిన మహాప్రస్థానమే తార్కాణము. చివర కతడొక్కడే మిగులును. తక్కిన సోదరులందరు భార్యతోసహా వెనుకపడిపోవుదురు. నీకు మాత్రమింతకంటె వేరుగతికలదా? రాజాధిరాజై, చతురంభోధిపరీతరాజ్యమును చతురంభోధి సములగు సోదరులతో ననుభవించి, యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడే ఛత్రముపట్టిన రాజుగతియే యిదియైనచో నీలెక్క యెనరికోయి!

# నీ సేవకుడు

ఈ రోజులలో నితరులచేత సేవచేయించుకొనుట కష్టము నష్టము, ప్రమాదభరితము. ఇతరులు నీకేందుకు సేవచేయవలెను? ఎవరైనను నూరక సేవచేతురా? నేడు సేవచేయువాడు చేయించు కొనువాడుకూడ సుఖము ననుభవించుటలేదు. పైగా మాటి మాటికి సమ్మెలు, తగులపెట్టుటలు, భస్మముచేయుటలు, నశింపు చుటలు. నీకు తెలియకుండగనే, నిన్ను జీతబత్తెము లడుగకుండ గనే, రాత్రి పవలు నను భేదములేకుండగనే, యెండవానయను శంకలేకుండ నిరంతరము నీ సేవచేయుటకు నీ కొక సేవకు డమరి యుండ నీకీకర్మమేల? అతనిరాకకొరకు నీ వెంతమాత్రము వేచియుండ నక్కరలేదు.

సంకల్పమాత్రముచేతనే యతడు రెక్కలుకట్టుకొని నీ పరిచర్యసేయును. నీ మనస్సు నీకు జోహారులర్పించు నీ నిజ

సేవకుడు. ఆజ్ఞాపించినదే తడవుగ నతడు నీకు కన్పించకుండగనే నీకు ప్రత్యక్షసేవచేయును. కాని యితడొక యపూర్వసేవకుడు. నీ వతనిచే పనిచేయించుకొనవేని యతడే దయాదాక్షిణ్యరహితముగ నిన్ను నలిపివేయగల నిరంకుశుడు కావచ్చును. ఇది నీ నిర్ణయముమీదనే యాధారపడియుండును. ఇతడు నీ వెట్లుపయోగించుకొనిన నట్లే యుపయోగపడును.

"నేను ఆరోగ్యమును, బుద్ధిని. బుద్ధినిపొందుచున్నాను" అని నిత్యము తనకుతాను చెప్పుకొనుటచే వజ్రకాయమును, మనోదిట్టతను పొందినట్లొక ప్రఖ్యాతపురుషుడు చెప్పెను. నిజమే. ఆత్మబోధ జీవితామృతము. జీవనౌషధము. మనస్సునకు శరీరముమీద నప్రతిమానమైన ప్రభావము కలదు. ముఖ్యముగ 'నాంతరంగిక' మనస్సుయొక్క ప్రభావము తిరుగులేనిదని గ్రహించితిమి. ఆరోగ్యమును, పవిత్రతను, శక్తిని వృద్ధిచేసికొనుటకేగాక మనస్సు ననేకరోగములను కుదుర్చుటకుగూడ నుపయోగింపవచ్చును. రోగములే లేకుండచేసికొనుటకును మనస్సే కీలకము. పరిశుద్ధమనస్సు రోగము నెరుగదు.

ఈరోజులలో నిద్రపట్టకపోవుటొక పెద్దరోగము. అనేకమంది యనేక కారణములచే దీనికి గురియగుచున్నారు. ఉపేక్షించినకొలది నిది మరికొన్నిరోగములకు తావిచ్చుచుండును. దీనిని నివారించుట కనేకమందులను వాడుచున్నారు. ఈ మందులు మరికొన్నిదోషములను తెచ్చిపెట్టుచున్నవి. వేనిరోగములను తెచ్చిపెట్టుమందులను వాడుట మంచిదా? తలచినంతనే నీ సేవచేయు మనస్సుచే చికిత్సపొందుట యుక్తమా ?

"నేను నిద్రింపవలయును. నిద్రింతును. నిద్రించుచున్నాను." అని నీ మనస్సు నిక్కచ్చిగా సూచించెననుకొనుము. ఈ భావమును వెంటనే నీ యంతరంగమనస్సు క్రియారూపములోపెట్టును, మొదటిది శాసించును. రెండవది యాచరించును. ఒకేమనస్సు రెండుశక్తులను - భావ క్రియాశక్తులను - కలిగియుండును.

శరీరముమీఁద మనస్సునకు ప్రభావమున్నట్లే మనస్సు మీఁద ప్రాణవాయువునకును ప్రభావము కలదు. మనస్సు చంచలమైనది. కోతివంటిది. గాలివంటిది. దాని చాంచల్యమును ప్రాణవాయువు చిక్కబట్టును. కనుక నీ సంకల్పముతో పాటు ప్రాణవాయువునుపూరించి విడిచిపెట్టుచుందు వేని పదినిమిషములలో నీకు నిద్రపట్టును. నీశ్రద్ధా విశ్వాసములనుబట్టియే నీ యంతరంగమనస్సు పనిచేయును, నీవు దానిని మోసగింపజాలవు. అంతరంగశుద్ధి యున్నప్పుడు సమస్తము చేకూరగలదు.

నిద్ర తెప్పించుకొనినట్లే నీవు నీ మనస్సు ద్వారా ననేకపనులను చేయించుకొనవచ్చును. నిజముగ నది చేయజాలని దేదియును లేదు. వ్యాధులెట్లు కలుగుచున్నవి? మానసిక విపర్యయమువలననే వ్యాధులుకలుగుచున్నవి. కాలిబంతిని గాలితోపూరించినపుడే నీ యాటకు పనికివచ్చుచున్నది. అట్లే నీలోనున్న యంతర్మారుతములు (నీలో వివిధపనులుచేయు గాలులు) స్వాస్థ్యము, సామరస్యము. పరిశ్రమచెందినపుడు నీ శరీరస్వాస్థ్యము దానంతటదియే చేకూరును. కనుక నీ మనస్సు చేత నీ సేవచేయించుకొనుము. అదియే నీ సేవచేయనినాడితరులెంతమంది చేసినను ప్రయోజనములేదు. నీ నీడ నిన్ను వీడు

నేమో కాని, నీ మనస్సు నిన్నువీడదు. మనస్సతి సునిశితమైన దంటిమికదా! ప్రాణాయామము, ఆసనములు నీ శరీరమునకు మనస్సునకు, అవయవములకు సుఖమునిచ్చును. చురుకుదనము నిచ్చును. రాత్రి నిద్రించినపశువులు లేచీలేచుటతోడనే యొక్క సారి యొడలువిరుచుకొనుటను నీవుచూడలేదా? దానితో వాటి బద్ధకముతీరిపోవును. ఆసనాదులవలన యజీర్ణము, అతిజీర్ణము, కుజీర్ణము, విజీర్ణము మొదలగు రోగములు పోవును. నాడీమండల మునకు, రక్తప్రవాహమునకు చురుకుదనము కలుగును. శరీర ములోని ప్రతిభాగమునకు నొకవిధమగు విద్యుచ్ఛక్తి సంక్ర మించును. ఇట్టి శరీరములోనున్న మనస్సు తక్కినపనియంతయు పూర్తిచేయును. శరీరమునకు తేజస్సును, ఓజస్సును ప్రసా దించును.

# విజయీభవ దిగ్విజయీభవ

చిన్ననాటి గిలకలపద్యములలో గురువు లిట్టి పాటలను పాడించెడివారు. బాలబాలికలు గిలకలబద్దలు తీసికొని విజయు డైన యర్జునుని బాణములను పూజించుచు 'విజయము పొందుము, దిక్కులనుకూడ జయింపుము' అను భావము లుగల గీతికలను పాడుచుండెడివారు. లేతహృదయములలో నిట్టి భావములే హత్తుకొనవలయునని పూర్వుల యభిప్రాయము. ఇది చాల గొప్ప సాంప్రదాయము. బాలమనస్సులపై నిట్టి భావములే చిందులాడవలయును.

ఈ రోజులలో నిట్టిపాటలు, భావములు, గురుత్వములు పోయి క్రమముగ వేపరులిచ్చువారి పేరులు, దిద్దువారి పేరులు తెలిసికొని యడ్డదిడ్డ వ్యవహారములు సాగింపబడుచున్నవి. ఇది బహు తేలిక మార్గము. సంవత్సరముపొడుగున కష్టింపనక్కర లేని జంత్రీపద్ధతి. వర్జిల్ అను రోమకకవి యొక పందెపుజట్టును గురించి "మేము చేయగలము అను భీమా, భీమా వారి కుండెను. కనుక వారు చేసితీరుదురు" అని జోస్యము చెప్పె నట. వా రట్లే చేసి విజయులైరి. ఇదియొక చండశాసనము. హృదయదౌర్బల్యమే యీ మానవయంత్రమును క్షీణింప జేయును.

'హృదయదౌర్బల్యమును వీడుము. విజయుడవుకమ్ము' అనియేకదా శ్రీకృష్ణుడర్జునున కుపదేశించినది. నీ యందును, నీ శక్తులయందును నీకుండవలసిన విశ్వాసముకంటె గొప్ప భీమా వేరొకటి యీ ప్రపంచములో లేదు. ఇదియే నీ జీవగఱ్ఱ. అవకాశములు సదా వచ్చుచునేయుండును. జీవితములో నిరంతరము సంభవించుచుండు నవకాశములను దక్షతతో చేపట్టవలయును. ఆలోచనాదక్షత నీ కలవడవలయును. నీ ప్రక్కవాడు జయించుచున్నాడే! నీవు జయింపలేకపోవుటకు కారణమేమి? నిశ్చయముగ తొంబదిపాళ్ళుదానికి నీవే కారకుడవు. జయింపలేనను భయసందేహములు నీ కుండబట్టియే నీవు జయింపలేకపోతివి. సందేహావారణమును నీకు నీవే తగిలించుకొంటివి. సంశయాత్ముడు నశించునని గీత చెప్పుచున్నది. అనుభవము రుజువుచేయుచున్నది.

జయముపొందినవాని హృదయమును పరిశీలించి చూడుము. తన యాశయము నెరవేరితీరునని యతడు కృతనిశ్చయుడై రంగములోని కురికెను. అతనిది సరియైన యోచన; యుక్తమైనభావన. దుర్బలత్వ మతనిలో లేదు. నీయోచనను బట్టియే నీ క్రియలు నెరవేరును. ఆకసమున నావిరిరూపములో నున్నదే భూమిపై వర్షముగ మారిపోవుచున్నది. అట్లే నీహృదయాకాశమునందున్న భావమే క్రియారూపముగ ఫలించుచున్నది. దీనికి నీ వింకొకనిని నిందచేయుట రోగమొకచోట వైద్యమొకచోట యనునట్లుండును. 'చేయగలను' అని యనుకొనినపుడే నీవు దేనినైనను చేయగలవు.

ఎప్పుడును విజయమునే కలగనుచుండుము. కలలే నిజములగును. "స్వరాజ్యమును గురించి కలలుగనుడు" అని ముప్పది, నలుబది సంవత్సరముల క్రితము 'భారతకోయిల' సరోజినీదేవి యహర్నిశలు గానముచేయుచుండెడిది. ఆమె కలలే నేడు ఫలించెను. విజయవంతములయ్యెను.

నిద్రింపబోవునపుడు, నిద్రనుండి లేచీలేచుటతోడను నీ శక్తులను గురించి నీకు నీవు బోధించుకొనుము. ఇది నీకొరకు గాని పైవారికొరకు కాదు. డాంబికముకొరకు కాదు. మన సత్త్వము నెరుగనివారికి దీని ప్రయోజనము తెలియక పోవచ్చును. తత్త్వవిదుల కిది యాత్మప్రబోధమని తెలియును. నీకు నీవు చెప్పుకొనినంతమాత్రముచేత నీవు సమస్తమును చేయ గలుగుదువని దీనిభావము కాదు. ఇట్టి విశ్వాసము, ప్రబోధము, మననము విధిగా నీశక్తుల ననేకరెట్లు పెంచగలదు. నీవిశ్వాసమే నీకోట.

విజయము నీ వ స్తిత్వమునుండి, నీ సూక్ష్మనాడుల పటుత్వమునుండి నీకు కలుగవలయును. దాని నితరులు నీకు బదిలీచేయజాలరు. విజయమే విజయమును సాధింపగలదు. దానిని నీవు ముందర మానసికముగ నారాధింపవలయును నూటికి నూరుపాళ్ళు నిక్కచ్చిగ నారాధింపుము. అది యప్పుడు ఘనీభవించి కార్యరూపము దాల్చును.

"తనను తానే యుద్ధరించుకొనవలయును. తనను తాను నశింపుచేసికొనరాదు. తనకు తానే బంధువు, తానే శత్రువు. తనను తాను జయించినవాడు తనకు బంధువగుచున్నాడు. అట్లు జయించలేనివాడు తానే తనకు శత్రువగుచున్నాడు" అను నీ గీతావాక్యము నెన్నిసారులు జపించినను చాలదు. ఇంత కంటె గొప్పసత్యము వేరొకటి లేదు.

## ఏకాగ్రత

ఏ చిన్నకార్యమునైనను, పెద్దకార్యమునైనను సునాయాసముగ, సౌష్ఠవముగ సాధించుట కేకాగ్రత యతిముఖ్యము. మానవుడనగా మనస్సేయని మన మనేకసారు లిదివరకే చెప్పుకొంటిమి. ఈ మనస్సు చంచలమైనది, చపలమైనది, నిముస మొకచోట నిలువనిది - అయినచో నీమనస్సు నేకాగ్రతగ నుంచు టెట్లు? ఇది గాలిని మూటగట్టుటవలె నున్నదే! అవును. గొప్పకార్యము లన్నియు నిట్లే యుండును.

దీని కొక్కటే రహస్యము కలదు. నీవు తలపెట్టిన కార్యమునందు తొలుత నీకు శ్రద్ధయుండవలెను. నీయందే నీకు శ్రద్ధ కలుగవలెను. అదియే నీ జీవితములోనున్న కిటుకు. శ్రద్ధ లేనిపని నరములేని నాలుకవంటిది.

ఒక విషయముమీఁద నీమనస్సు ననన్యముగా నిలుపుటయే శ్రద్ధ. నీవు చేపట్టినవిషయముతో నీ వేకమైపోవలయును. శ్రద్ధగల విషయముమీఁద మనస్సు దానంతటదియే లగ్నమగును. 'వాని కా దృష్టి లేదు' అని మనము సాధారణముగ ననుచుందుము. దీని యర్థమేమి? అత డేదృష్టియు లేక యున్నాఁడని దీనిభావము కాదు. అటువంటిస్థితి యుండ నేరదు. అతని దృష్టి మరియొకదానిమీఁద కలదనియే దానిభావము. నీకు శ్రద్ధగల విషయముమీఁదనే నీదృష్టి నిలువగలదు. నిలుచును. శ్రద్ధ యేకాగ్రతకు లంగరువంటిది. చేతనున్న పనియందు నీకు శ్రద్ధలేనిచో నీమనస్సు శ్రద్ధగల మరియొక విషయము మీఁదను వ్రాలుచున్నది. నీ లోకరక్షకుఁడవు కావచ్చును. విద్యార్థివి కావచ్చును. నీ నవలంబింపదగు వృత్తిని గురించి యోచించువాఁడవు కావచ్చును. ముందు నీకు దేనియందు శ్రద్ధ కలదో యోచించుకొనుము. నిశ్చయించుకొనుము. నీకు శ్రద్ధ కలవిషయములోనే నీ జీవితమునుగడుప నిశ్చయించుకొనుము. దీనిని తేల్చవలసినవాఁడవు నీవేకాని యితరులుకారు. 'చిత్తము శివునిమీఁద భక్తి చెప్పులమీఁద' యున్నచో లాభములేదు.

శ్రద్ధలేనిపనిలో నీ వెన్నఁడు విజయమునొందజాలవు. దానిపై నుండవలసినంతదృష్టి నీ కుండదు. బహుశః శ్రద్ధలేని పనియందు నీ విదివరకే యిరుకుకొనిపోయి యుండవచ్చును

అట్లయినచో నీవేమిచేయదగును? వెంటనే దానియందు నీవు శ్రద్ధకల్పించుకొనవలెను. శ్రద్ధలేనిపని పత్రిచేటు. ఈ ప్రపంచములో ప్రతిపనియందు నేదోయొకవిశేషము, ప్రత్యేకత యున్నది. నీవు ప్రయత్నించి చూతువేని ప్రతిపనిలోను శ్రద్ధ తీసికొనదగిన యంశ మొకటి నీకు కాన్పించును. ప్రతిపనిలోను నొక యంద ముండనేయున్నది. కనుక నీపనియెడల నీకు గౌరవము కలుగవలెను. గౌరవములేక చేయుపని గాడిదపని.

ఆత్మవిమర్శచేసుకొని నీ పనిలో నీ వొక ప్రమాణ స్థాయిని సంపాదించుము. నీ పనితనముకొరకు ప్రజలు నీదగ్గరకే వచ్చునట్లు చేసికొనుము. ఎందరెందరో మహానుభావులు ఖండ ఖండాంతరములనుండి పర్ణకుటీరములోనుండిన గాంధిమహాత్ముని దర్శించుటకు మండుటెండలలో రొజుకొనుచు వచ్చెడివారు. కారణము! అతని పనితనము.

నీ పనిలో నేదోయొక క్రొత్తదనము, నైపుణ్యము కనిపెట్టుము. నేనొక బ్రహ్మనా యనుకొనకుము. నిజముగా నీవొక బ్రహ్మవే! నీవు వెదకనారంభించినచో నీకే యాశ్చర్యము కలుగునట్లు నీ పనిలో నొక క్రొత్తదనము కన్పించగలదు.

ఒకసారి నీ కా రుచి, నవ్యత కన్పించినచో నీవిక దానిని విడిచిపెట్టవు. దృష్టిదానంతటదియే దానిపైప్రసరించును. అప్పుడు ప్రజలదృష్టి నీయందు, నీ పనియందు లగ్నమగును. ఏకాగ్రత చేకూరుటతోడనే నీ పనియందు నీకు చాతుర్య మబ్బుచున్నది.

అభ్యాసమువలనకూడ నేకాగ్రతలభ్యమగును; దోహదమగును. ఇతర యభ్యాసముల నభ్యసించినట్లే యేకాగ్రతను

కూడ నభ్యసింపుము. అభ్యాసమే నిన్ను పూర్ణునిచేయును. చీమలబారులకు రాళ్లుకూడ నరిగిపోవుటలేదా !

ప్రతిమానవుడు రోజు కొకగంటయైనను చదువుకొనుటకు వినియోగింపవచ్చును. ఇది బహు చక్కని యభ్యాసము. ఎన్ని పనులున్నను దీనినొక వ్రతముగ పాటింపవచ్చును. కేవలము వినోదార్థ మే నవలనో చదువుటకంటె నీ మనస్సునకు పనికల్పించునట్టి యర్థశాస్త్రమునో, నీతిశాస్త్రమునో పఠింపుము. బలవంతముగ నైనను రోజు కొక గంట దీని కుపయోగించి నీవు చదివిన దానిలోని సారమును గ్రహింపఁబూనుము. నీ యిచ్ఛాశక్తిని వినియోగింపుము. ఎన్ని యవాంతరములు కలిగినను నీ దృష్టి యీ యభ్యాసముపై కేంద్రీకరింపుము.

'ఏకాగ్రతయే మతము, ఏకాగ్రతయే జ్ఞానద్వారము' అని యొక ఋషి చెప్పిన వాక్యములలో నెంతేని సత్యము కలదు. అవి యనుభవవాక్యములు. అభ్యసించినకొలది నేకాగ్రత మరింత నిశితమగును. దానివలన నీ వనుకొనిన ఫలము చేకూరును. దానితో నీకు మరింత శ్రద్ధపుట్టును. ఈ శ్రద్ధద్వారా తిరిగి నీ జ్ఞాన మభివృద్ధియగుచు నీ యొక శుభచక్రమును సృజించుకొనిన వాడవగుదువు. నీ శుభచక్రమే నీకు రక్షణయిచ్చు నీ విష్ణు చక్రము.

# భ్రమ

సాధారణముగ మనమందరము నొకభ్రమకు లోనగుట పరిపాటియైనది. మనము ప్రతిదానిని సావధానముగ నాలోచించు నంతటి తీరిక, సాంప్రదాయము లేక నీప్రపంచములో సంభవించు సర్వము దానంతటదియే జరిగిపోవుచుండునని, మనప్రయత్న మక్కరలేదని, దైవమొకడు వాడికర్మముకాలి మనకొర కన్నియు చేయుచుండునని యనుకొనుట నమ్మకమైనది; అభ్యాసమైనది. మతమైనది. చివరకు వేదాంతముకూడ నైనది.

ఇది కేవలము భ్రమ. తీరని యపకారము లోకమునకు, నీకు గావించుచున్న భ్రమ. అనుభవము, సత్యము, నిత్యసంఘటనలు వేయినాలుకలతో చాటుచున్నను మానవుడు తన యంత్రమునకు తానే యజమానియను సత్యమును మరచుచున్నాడు. దైవమును గురించి యతని చైదములను గురించి యోచించుటకు ముందు మనము మన యంత్రమునకు తగిన పరిశ్రమను దోహదముచేయవలెను. అతనినిగురించి యోచించుటకుగూడ నిది దానికి తగినస్థితిలో నుండవలెనుకదా! దీనికి మార్గమేమి? బాల్యమునుండియు నే యవయవము నెట్లుపయోగింపవలయునో తెలిసికొని, ప్రయత్నపూర్వకముగ, స్వయంకృషి ద్వారా యభివృద్ధి పొందుటే తప్ప దీని కింకొక మార్గములేదు. మానసవాభివృద్ధి కిది యొక్కటే కవాటము.

నీ ప్రతి యాలోచన, ప్రతి క్రియ నీ శీలముమీద, నీ శరీరముమీద తన ముద్రను విధిగా వేయుచుండును. కనుకనే ప్రతి మానవునిలో నేదో యొక ప్రత్యేకత, వ్యక్తిత్వము కాన్పించు

చునేయున్నది. కాదందుమా యొకేదైన యొక మూసలో మనలనందరను కరగించి పోసినచో ఫ్యాక్టరీలో దిగుమతియగు సినుతానులవలె మనమందరము వ్యక్తిత్వము లేక ముద్దవలె నుండవలెను.

మనమిట్లుండుటలేదే! ఇట్లుండరాదు. ఇది దరిద్రలక్షణము. అజ్ఞానలక్షణము. అభివృద్ధిని నిరోధించులక్షణము. 'నీవు నేను' బాగుపడుట కుపయోగింపని వెర్రి వేదాంతము.

"మన మెక్కవలసిన నిచ్చెనను మనమే నిర్మించుకొనుచున్నాము. మంచికాని చెడ్డకాని యెన్నడు నూరకపోవుట లేదు. దానిని నీవు మరువవచ్చును. నిర్లక్ష్యము చేయవచ్చును. కాని మన నాడీమండల మెప్పుడును మరచిపోవుటలేదు. అది క్షమింపదు." అని మనస్తత్త్వవేత్తలు చాటినారు.

సృష్ట్యాదినుండియు నింతవర కెందరు పుట్టలేదు! ఎందరు గిట్టలేదు! నేడు వారిని మనము స్మరించుచున్నామా? ప్రతిభావంతులగు నేకొద్దిమంది పేరులో మనము వినగలుగుచున్నాము. తక్కినవారు విస్మృతసాగరములో కలసిపోయిరి.

ఈ ప్రతిభను వారికెవరు ప్రసాదించిరి? ఏ దేవునికైన నిట్టి పక్షపాతముండునా? పక్షపాతమున్నచో నతడు దేవుడగునా? ప్రతిభ మానవుని స్వార్జితవిత్తము. నిజధనము. చెమటబిందువులమన చిందిన నిష్యందము.

మనము ప్రతినిమిషమును, ప్రతివిషయమును విస్మరింపరాదు నిర్లక్ష్యము చేయరాదు. ఒకసంవత్సరమునాటికి నీవు పొందగల రూపమును, సిద్ధిని నీ ప్రస్తుతభావములు, చేతలు నిర్ణయించుచున్నవి. నీ వర్తమానమే భవిష్యత్తు అగుచున్నది.

వర్తమానమును జారవిడిచినవాడు భవిష్యత్తును, జీవితమును వ్యర్థముచేసికొనుచున్నాడు.

ప్రకృతి యెన్నడు బాకీ యుంచుకొనదు. లేనిదానిని ప్రసాదింపదు. మానసికజీవితమునకును ఈ ధర్మమే వర్తించును. సోమరితనము మానసికముగనే ప్రారంభమగును. నీ పనిలోనేమి యితరుల పనిలోనేమి నీవు చూపు నిర్లక్ష్యము అవినీతి, స్ఖాలిత్యము నిన్ను విడిచిపెట్టవు. ఇదంతయు 'హూమ్‌కాకి' యగునని నీవు భావింతువేని మోసపోదువు. ప్రకృతి వెంటనే తన కాతా చూపి నీ చెవులు మెలిపెట్టి నీ చేష్టలకు నిన్ను గుంజివేయునపుడు నీవు తెల్లపోవుదువు; డిల్లపోదువు. అప్పటికన్ని జవసత్త్వములు నుడుగుటచే జీవితము రోతగ కాన్పించును; వ్యర్థమనిపించును. బాల్యాదపి వ్యర్థమైన భ్రమకు లోనుగాక ప్రతినిమిషము ప్రయత్నపూర్వకముగ గడిపినవానిజీవితమే ధన్యమగుచున్నది. ఏ మహాత్ముడును అప్పనముగ మహాత్ముని చేయబడుటలేదు. పౌరుషమే దైవమునకు దారి చూపును. పౌరుషమును మించిన దింకొకటి కలదనుకొనుటయే భ్రమ.

శ్లో॥ ఉద్యమే నహి సిద్ధ్యంతి కార్యాణి, నమనోరథైః
తద్దైవ మితి సంచింత్య త్యజే న్నోద్యోగ మాత్మనః॥

కార్యము ఉద్యమమువలన ననగా ప్రయత్నము చేయుట వలన సిద్ధించుచున్నవి కాని మన మనోరథములవలన, యూహల వలన, భ్రమవలన సిద్ధించుటలేదు. నీ కార్యమును చేసిని దైవము చేయునని భ్రమపడి విడువరాదు. అనియే పై శ్లోకము విదితముచేయుచున్నది.

# ఇతరులున్నారోయి

'రోమకపట్టణములో నున్నపుడు నీవు రోమనుప్రజ లాచరించునట్లే యాచరింపుము' అను సామెత కలదు. సామెత లనుభవవాక్యములుకాని రిక్తపదజాలము కాదు.

ఈ సామెతలోని భావనేమి? ఈ ప్రపంచము కడు విశాలమైనది. ఇందులో నీ వొక్కడవే జీవించుటలేదు. నీవంటి వారు కోటానుకోట్లిచ్చటకలరు. అనేక శీతోష్ణస్థితులు, ననేక యనుభవములు, ననేక యాచారములు, సాంప్రదాయములు, చరిత్రలు కలవా రిచ్చట కలరు. అందులో నీ వొకడవు కాని నీ వొక్కడవే ప్రపంచమును గుత్తకొనలేదు. నీవలెనే యితరులును చూడగలరు, వినగలరు, ఆలోచింపగలరు. మంచి చెడుగులను తర్కింపగలరు. నీవు చేయగల పనులన్నియు చేయగలరు. 'దీనివలన నాకేమి కలిసివచ్చును? నేను భావించునదే సరియైనది. ఇతరులభావనలు యుక్తమైనవి కావు. నామాటయే నిజము, శాసనము. ఇతరులమాటలు నమ్మదగి నవి కావు.' అను సంకుచితభావము, అహంకారభావము సర్వా నర్థములకు మూలము. ఇతరులను మోసపుచ్చుటకంటె మన లను మనమే మోసపుచ్చుకొనుచుందుము. ఇది దోషము లలో దోషము.

'అతడందరితోను చక్కగా కలిసిపోవును.' అని యమెరి కనుప్రయోగమొకటి కలదు. అనగా నత డెట్టి సంఘములోను,

ఏ పరిస్థితులలోను తన సమతను పోగొట్టుకొనడని, స్వస్థచిత్తుడై యుండగలడనిభావము. పెరుగువానితో సుఖముగ, సరసముగ జీవింపగలవాడు ప్రకృతిని, సృష్టిని చక్కగా సవగాహనచేసి కొనిన సిద్ధుడు.

అతడు ప్రపంచసరళిని గ్రహించినవాడగుటచే నతని కన్నివైపులనుండి శుభములే చేకూరును. అతడు దేనిని దాచు కొనవలసినపనిలేనివాడు. లేనిదానిని నటింపక, నున్నదానిని కప్పిపెట్టక, పదిమందికి హితమగుదానిని హితమగువిధమున నాచరించుచు, తనవలన నెవనికి నావంత హాని కలిగింపక జీవించు వానికంటె ధన్యులెవరు? తన జీవితము తనకంటె నితరుల కెక్కువ ప్రియతమముగ నుండునట్లు జీవించుకళకంటె గొప్ప కళ యింకొకటిలేదు. దీనికి వ్యతిరేకమైన కళలు, శాస్త్రములు ఆర్థిక, రాజకీయాది శబ్దాడంబరము, కాగితపుపువ్వులు.

ఇతరుల యభిప్రాయములను చక్కగ వినుము. హృదయ పూర్వకముగ నాలింపుము. అట్లు చేసిననా డితరులును నీ యభి ప్రాయములను మన్నింతురు. నీ దృష్టిలో నీ కతి ముఖ్యమైనది ఇతరులదృష్టిలో నంతముఖ్యము కాకపోనచ్చుననువిషయము నీవు గ్రహించినపుడు నీ కెంతయో సుఖ మబ్బగలదు. దానివలన విశాలదృష్టి యలవడును.

క. వినదగు నెవ్వరుసెప్పిన వినినంతనె వేగపడక వివరింపదగున్
కని కల్ల నిజము తెలిసిన మనుజుడె పో నీతిపరుడు
మహిలో వేమా.

ఇది వేమనయోగి ప్రపంచమున కర్పించిన దివ్యసందేశము. పై సోమసూత్రము నవలంబించిననాడు సగము ద్వేషములు వాటంతటవియే మాయమగును.

సోక్రటీసు గ్రీసుదేశపు మహావేదాంతి. సిద్ధపురుషుడు. అతడు ప్రపంచమున కేమి బోధించెను?

"ఒక్క విషయమే నాకు తెలియును. నాకేమియు తెలియదను విషయ మొక్కటే నాకు తెలియును." అని యతడెల్లపుడు నెలుగెత్తి చాటుచుండెడివాడు. మూర్ఖప్రజ లతని నర్థము చేసికొనలేక విషపాత్ర నతనికి సమర్పించిరి. అతడా గరళమును గడగడ త్రాగివేసి యసువులను బాసెను.

సోక్రటీసు చిరంజీవియైనాడు. అమరుడైనాడు. అతనికి విషపాత్ర సమర్పించిన గ్రీకులోకము విస్మృతసాగరములో కలిసిపోయెను. ఆ గ్రీసు నేడు లేదు. కాని యీ సోక్రటీసు ఆ దేశము నకేకాక ప్రపంచమునకంతకు నాదర్శపురుషుడైనాడు.

# ఎఱ్ఱజెండా

రైలుబండి రంయిమని రయముగా పోవుచుండును. త్రోవలో నేదో యొక యుపద్రవ మేర్పడుచుండును. అప్పుడేమి చేయుచున్నాము? వెంటనే యెఱ్ఱజెండా చూపబడుచున్నది. దానితో రైలు ఆపివేయబడుచున్నది. ఉపద్రవము తొలగింపబడుటతోడనే తిరిగి రైలు ప్రయాణము సాగించుచున్నది.

నీ జీవితప్రయాణములో కూడ నవ్వు డప్పుడు యెఱ్ఱ జెండా లవసరము కావచ్చును. నీకు కలిగిన జయములవలన, నీ కబ్బిన కొద్ది చతురతవలన; నీవు నేర్చిన కళాకౌశలమువలన లేదా పదవివలన నీతల కొంత తిరిగిపోయియుండవచ్చును. బిరుసెక్కవచ్చును. 'నాయంతటివాడు లేడు' అని యహంకరించవచ్చును. ధనమదమో, విద్యామదమో, కులమదమో బుఱ్ఱకెక్కవచ్చును. దానితో నోడలెఱుగని శివమాడవచ్చును.

ఎంతదూరమో పోనేల? మన రాజకీయనాయకులను కొందరిని చూడరాదా? నాలుగు వోటు లే గాంధిమహాత్ముని ధర్మముచేతనో రావడముతోనే గొప్పవారై మాటిమాటికి చెల్లని వాఙ్మూలము లిచ్చుచు నోటి టపాకాయలను పేల్చుచున్నారు. వీరు ప్రతిపక్షులుగనుండి ప్రభుత్వముమీద కారాలు నూరునపుడు, బీరాలు పలుకునపుడు, ఆరాలు తీయునపుడు, వాదాలు చేయునపుడు కనపరచిన చాకచక్యము వీరే యధికారములోనికివచ్చినపుడు బండిసున్న యయ్యెను. అంతా పూజ్యము. పదిమంది నవ్వుట, చాకలి పేరయ్యలగుట, తటస్థించుచున్నది. దీనివలన మనము నేర్చుకొనవల్లసిన గుణపాఠ మెద్ది?

"సింహాసనముపైకి ప్రసరింపచేయబడు తీవ్రజ్యోతి ముందు సర్వము బయల్పడక మానదు" అను సామెత కలదు. తరచు మనజీవితములలో కూడ నిట్టి ఘట్టము లనేకములు సంభవింపవచ్చును. ఈ యుపద్రవమును మనము మరువరాదు.

విజయము తలకు కైపుకలిగించు నిషావంటిది. అది యభివృద్ధికావలసిన శక్తులను నాశము చేయును. ఇంక చేకూరవలసిన దేదియు లేనట్లు సర్వజ్ఞత్వము తెచ్చిపెట్టును.

కార్యోత్సాహ మెల్లపుడు నుండవలెను. శరీర మున్నంత కాలము సమరము తప్పదు. స్వభావముచేత మానవుడు తన కొరకో లేక నితరులకొరకో పోరుసలుపుచుండవలసినశక్తి కలవాడు. ఆతడు క్రియాహీనుడుగ నుండజాలడు; ఉండరాదు.

మానవస్వభావముమీద నాధారపడు ప్రతి ప్రయత్నమునకు రెండువైపుల వాడియుండును. దీనివెనుక నంతులేని శక్తి యుండును. మానసికముగగాని శారీరకముగగాని యాగిపోవుట లేక నిలిచిపోవుట యను స్థితి యేదియులేదు. మనము ముందుకైనను పోవలెను. లేదా వెనుకకు దిగజారవలెను. కాని మానవయంత్రము వెనుకనడకకొర కేర్పడలేదు. ప్రకృతితో పాటు మనముకూడ ముందుకు పోవుచుండవలయును. ఆత్మపరీక్ష చేసికొనుచుండవలెను. విజయములో నున్న ప్రమాద మిచ్చటనే కలదు. దానివలన విశ్రాంతి చేకూరుననని మన మూహింతుము. అదియే గమ్య మనుకొందుము, సమస్తము ననుకొందుము.

ఈ లోకములో నిటువంటి 'విజయ' మెద్దియు లేదు. బాహ్యవిజయములతో గర్వించినవారు భంగపడిరి. ఇంకను భంగపడుచున్నారు. ఒకటి పూర్తిగ సిద్ధించినచో మనశక్తుల నితరవిషయములమీద కేంద్రీకరింపవలయును. సమరోల్లాసము లేనిచో స్థబ్ధులమగుదుము. విజయమువలన మత్తత, మాంద్యము కలుగరాదు.

విజయవంతునకు వినయమే భూషణము. మహాత్మునివలె జీవితములో విజయపరంపరలను పొందినవా డింకొకడు లేడు.

కాని యతనివంటి వినయశీలుడును లేడు. వినయవంతులకు 'ఎఱ్ఱజెండా' లవసరములేదు.

సమరోత్సాహమనగా గొఱ్ఱెపొట్టేలువలె నందరితోనూ ప్రతిదానికి పోరుటయని భావముకాదు. అందరితోను పోరాడుట తెలివితక్కువవారి 'హక్కు'. ఈరోజులలో ప్రతివాడు 'హక్కులను' గురించి గుక్కతిరుగకుండ నుక్కిరిబిక్కిరియగు నట్లు మాట్లాడు యోధుడే కాని యిఙ్గితజ్ఞానముతో సరసముగ ప్రవర్తించుట బహు యరుదైపోయినది. కనుకనే మహాత్ముడు సంపాదించిపెట్టిన విజయము నేడు 'తెల్లవానిరాజ్యమే మేలు' అని ప్రజ లనుకొనునట్లుగ పరిణమించినది.

# పేరులేని తెగులు

'ఉస్సు, అమ్మ, అబ్బ, అక్కడ, యిక్కడ, లాగుచున్నది, పీకుచున్నది, నవులుచున్నది, చురుకుచురుకు సూదిపోటులు పొడుచుచున్నది' అని యననివా రీరోజులలో నాగరికులేకారు. 'పెద్దవైద్యునిచేత వైద్యముచేయించుచున్నాము లెండి' అని సగర్వముగ, హుందాగ చెప్పుకొనలేకపోవుట చేతకానితనమైనది. మనతో మందులు, మందులతో మనము పరుగిడుట నాజూకుతనమైనది.

నిజమునకు మానవయంత్రము వైద్యమక్కరలేని యంత్రము. రోగములేకుండచేసికొనగలశక్తి మానవయంత్రములో నిమడ్చబడియున్నట్లు మన మిదివరకే గ్రహించితిమికదా! నీవుతినుయన్నమును నీకొరకితరులు జీర్ణముచేసిపెట్టగలరా? అట్లే నీ యారోగ్యమును నీకునీవే ప్రసాదించుకొనవలయును. కాపాడుకొనవలయును. నీ వెపుడును స్వస్థమానసుడవు కావలెను.

కుదురులేకపోవుట, చిందులుత్రొక్కుచు తికమకపడుట, సమతను పోగొట్టుకొని బాధతెచ్చిపెట్టికొనుట, మనోవికారములచే జీర్ణశక్తిని చెడగొట్టుకొనుట, పనికల్పించుకొనక నిరర్థకచేష్టలలోనికిదిగుట నేడు సామాన్యమైనది. మితముగ, హితముగ భుజించుచు, భుజించినదానిని జీర్ణముచేసికొనుచు నవసరమైనపు డుపవసించుచు తినినదానిని రక్తముగ మార్చుకొనగలవానికి రోగముండునా? మితిమీరి వెక్కసముగతినుట మానసికవ్యాధి. మనస్సును నీవు వశపరచుకొననిచో నదియే నిన్ను వశపరచుకొని నీపై నాధిపత్యమువహించును. ఎట్టికారణములున్నను మానసికసంక్షోభమునొందుటలో గుణమేమియు లేదు. సంక్షోభములేనినాడు రోగమే లేదు. తగినంత శరీరవిశ్రాంతి, మానసికవిశ్రాంతి యనుభవింపుము. నిద్రపోవునపుడు గాఢముగ నిద్రపొమ్ము. శరీరమును సుఖింపనిమ్ము. ఎట్టికలలులేని నిద్రనే యనుభవింపుము. నీ యవయవములను చక్కగా చాపుకొనుము. సుఖముగా నిద్రింపనినిద్ర నిద్రకాదు.

నీ మనస్సునుకూడ సుఖింపనిమ్ము. సుఖించుటకొరకే యది ప్రకాశించును. సాధారణముగ నిన్ను కుతలపెట్టు విష

యము లేవియు సంభవించునవి కావని మరువకుము. నీ వను కొనని దేదియో జరిగిన జరుగుగాక. ఎవడును సర్వజ్ఞుడు కాడు కదా!

ప్రతిదినము నీలోనికి నీవుపోయి పరమవిశ్రాంతి ననుభవించుటకు కొంతకాలము నేర్పరచుకొనుము. ఆ సమయమున ప్రపంచమునంతను మరచిపొమ్ము. నీ మానసికయంత్రము నెప్పటి కప్పుడు చైతన్యవంతము శక్తినంతము చేయుట కిదియే మార్గము. ఇదొక్కటియే నిరామయమైన పద్ధతి.

ఒకొ్కక్కపుడు ప్రతివానికి నేదోయొక దిగులు జనింప వచ్చును. దిమ్ము, భారము, జీవితమంధకారమగుట, బ్రతుకుచే వ్యర్థముగఁ దోచుట, దీనికి కారణము తెలియకపోవుట; ఆర్థికముగ నపజయము, సాంఘిక, రాజకీయములలో పరాభవము, గృహజీవితము రసవిహీనమగుట—ఇట్టి విపరీతములు జరుగ వచ్చును. అన్నిపరిస్థితులలోను మనోదండిని సమముగ నుంచు కొనగలవాడే ధన్యుడు. శరీరవ్యాధులకు వైద్యులు తరచు స్థలముమార్చుట మంచిదని చెప్పుదురు. మనోవ్యాధికికూడ రంగస్థలముమార్చుట మంచిది. అదియొక మందు. కష్టములు కలిగినపుడు వానినిగురించి యాలోచించుట మాని క్రొత్తవిషయములమీదకు, మన కుత్సాహముపుట్టించు విషయములమీదకు లేక చక్కని పరిశ్రమకలిగించు విషయములమీదకు బుద్ధి పోనిమ్ము. మనస్సు కలసటకలిగినపుడు, శరీరాయాసము, రుజ కలిగినపుడు కొంచెము తమాయించుకొని వాయుభక్షణ సేయుట మంచిది. అసలీ పరిశ్రమను నిత్యకృత్యములలో జేర్చుకొనుటను మించిన దైనికచర్యయే లేదు. కాని నే డీవాక్యములు

పేలవముగ పరిగణింపబడి, పరిహసింపబడుట యీ కాలధర్మ మైనది. అనాగరిక లక్షణమైనది.

వాయుభక్షణమనగా ప్రాణాయామము. భీముడు వాయు పుత్రుడు. ఆంజనేయుడు వాయుకుమారుడు. చిరకాలము జీవించు సర్పములు వాయుభక్షణచేయును. భక్షించుట యను టలోనే దానిని మెల్లగా పీల్చుటయని భావము. రోజుకు నియ మముగ పదిహేను నిమిషము లిట్లు చేసిచూడుము. దాని ఫలిత మును నీ యనుభవమే చాటగలదు. దీనివలన నూటికి తొంబ్బై తిక రోగములు మాయమగును. శరీరము తేలికయగును. తిని నది జీర్ణమగును. రక్తము పరిశుభ్రమగును. నరములబిగువు హెచ్చును. ఉత్సాహము మెండగును. మనోవికారములు మాయమగును. పేరులేని తెగుళ్లు పలాయనమగును.

పనిలేకపోవుటే పెద్దతెగులు. మానవు డేదోయొకపని కొరకే నిర్మింపబడినాడు. తనపనిని తాను తెలిసికొనవలెను. తనశక్తిని తాను వృద్ధిచేసుకొనవలెను. తనగుణమును తాను దిద్దుకొనవలెను. తనధనమును తాను పెంచుకొనవలెను. తన ధనమనుకొనుదానికంటె తనతోవచ్చు నిజధనము మరింత సుఖావహము. ముఖ్యము. ఇట్టి యాశయములతో పనిచేయు మానవునకు రోగములనుగురించి యోచించుటకే తీరికయుం డదు. రోగములను దరిచేరనిచ్చు బీజము లతనిలో లేనినా డవి యంకురింపజాలవు.

ఒక వస్తువున్న చోట నింకొకవస్తువుకు చోటులేదు. వస్తు వులో వస్తు విమడనేరదు అని పదార్థశాస్త్రము చెప్పుచున్నదే. ఆశయము వస్తువుకంటె నిజమైనది, రూఢియైనది, పటుతర

మైనది, జయప్రదమైనది. ఆశయమున్న చోట నిరాశకు, రోగ మునకు, భయవిచారములకు తా వెక్కడిది? ఇది నిజములలోని కెల్ల నిజమైన నిజము. మానవుడవో మానవప్రభువుడవో నీవే యాలోచించుకొనుము. మానవుడనని నీవు గుర్తించి దానిని సాధించుటకు ప్రయత్నించుటే నీ ధర్మము. రోగము మానవ ప్రకృతికి విరోధము. అసహజము.

# డబ్బుపిచ్చి

సన్యాసులకు తప్ప తక్కినవారికందరకు ధనమవసరము. కాసులేనివాడు కాటికికాళ్లుసాచినవాడు సమానమని పెద్దలు చెప్పుదురు. స్వాములుకూడ తరుచు ధాంతోదరుని గృహామే దర్శింతురు కాని పేదవానిగుడిసె తొంగిచూడరు. ధనావశ్య కతనుగురించి యిక నేమి చెప్పవలెను? ధన మవసరమే.

కాని యీ ధనము నెట్లార్జింపవలెను? ఎంత యార్జింప వలెను? ఎందుకార్జింపవలెను? డబ్బుకొరకే పుట్టినట్లు, డబ్బు పిచ్చిచేత ప్రపంచమునంతను బలివేసి, తానుకూడ దానికి బలియై దాని నార్జింపవలెనా? లేక దాని నొకసాధనగా, పరి కరముగా మాత్రమే గడింపవలయునా?

ఇదియే నేటిప్రశ్న. ఇది చాల గొప్పప్రశ్న. ప్రపంచము నంతను తారుమారుచేయునంతటి ప్రశ్న. నేటి ప్రపంచ దుఃఖములకు కారణమైన ప్రశ్న.

నిజమునకు ధన మొకపరికరము. సాధన. ఐశ్వర్యము. ఈ ఐశ్వర్యములో నీశ్వరత్వము లేకపోలేదు. కాని మన యభివృద్ధికొరకే, మానవాభివృద్ధికొరకే, దానిని నీవు వాడవలయును. గడింపవలయును. మానవాభివృద్ధికి భంగకరమగునట్లు దానిని వాడరాదు. గడింపరాదు. దానిని పాతివేయరాదు. దానిని పాతివేసినచో నది నిన్ను పాతివేయును. ఈ హద్దుల మధ్య నీవు ధనము ధర్మయుతముగ చేకూర్చవచ్చును.

కాని తరచు మన మేమిచేయుచున్నాము? ఏ పనిచేసినను సరే 'నీ జేబులను డబ్బుతో నింపనోయి' అని షేక్స్పియరుకవినాటకములో వచ్చినవాని పాత్రనే యభినయించుచున్నాము. ధనము, మరింతధనము, కోట్లకు పడగలెత్తుట. చివర కిది యొక వ్యాధియగుచున్నది. దొంగలభయము, దొరలభయము, పుచ్చుకున్నవారివల్ల భయము, చివర కింట పుట్టినవారివల్లనే భయము.

ఇంకొక యన్యాయము. ప్రక్కవాడు చేసిన పనిచేసిన నాపనియే చేసి ధనము సంపాదింప ప్రయత్నించుట. మనము దేనికి తగియున్నాము? మనలో నే ప్రత్యేకతయు లేదా? మనము చేయుసృష్టిచేత ప్రపంచమును భాగ్యవంతముచేయగల దేదియు మనలో లేదా? భూభారముకొరకు పుట్టితిమా, భూభారము తగ్గించుటకు పుట్టితిమా? అను నాలోచనలుచేయక కోతివలె నితరుల ననుకరించుటయే యుగ్గుపాలతో నేర్చుకొనుచున్నాము. ఒకడు నాటకములువేసి లక్షలు సంపాదించినాడు. ఒకడు ప్లీడరీచేసి భూములు కొనినాడు. ఒకడు వైద్యముచేసి వేలు గడించినాడు. ఇంకొకడు పేకాటలోను, బ్రాకెట్లలోను

లక్షాధికారి యైనాడు. అని యీ వరవడిలోనే నడవ ప్రయత్నింతుము.

ఒకరిని గ్రుడ్డిగ ననుకరించుటయే మనపనికాదు. ఇంకొకడు జయముపొందినరంగము మనకు పనికిరాకపోవచ్చును. ఇతరులనుచూచి చేయుపనులలో నూరింటికే యొకడో జయింపవచ్చును. తక్కినవారు విఫలులగుచున్నారు. దీనికి కారణము లేదా? లేకేమి? నీకు నీవేసాటి అతని కతడేసాటి. అతడు నీవు కాజాలడు. నీవు నీవే! అత డతడే! నీలోనున్న శక్తినే, నీ ప్రత్యేక సంపదనే, నీ ప్రకృతి నీకు ప్రసాదించిన వరమునే. నీధర్మమునే నీ వభివృద్ధిచేయవలెను. చేయగలవు. 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' స్వధర్మనిర్వహణలో చచ్చుటయైనను మేలు. పరధర్మము భయావహము అని గీత చాటలేదా? ఈ ముఖ్యవిషయమునే మనము నిర్లక్ష్యము చేయుచున్నాము.

నిజము తెలిసికొనగోరుదువా? అట్లయినచో నీ వొక్కపని చేయుము. భూతద్దమొకటి తెచ్చి నిన్ను నీవు పరీక్షించుకొనుము. నీ శరీర మానసిక పాళ్ళలో, నీ గుణవిశేషములో నెక్కడో యొకచోట తక్కిన ప్రపంచమునుండి నిన్ను వేరుగ చూపించు శక్తి యొకటి కన్పించును. నీలో నేదియో యొక ప్రత్యేకత ద్యోతకమగును. నీ 'వ్యక్తిత్వము' తెలియబడును.

ప్రతిమనిషిలో నొక ప్రత్యేక ప్రతిభకు స్థానమున్నది. ప్రపంచము నీవు సమర్పించుదానికొరకే యెదురుచూచుచుండును. కోతివలె నీ వితరుల ననుకరించుటలో నీకేమి హాయి కలదు? అట్లు చేసినచో ప్రపంచమునకు నీకు సమర్పించున దతి

స్వల్పము. ఇతరులు వారివారి శక్తులననుసరించియే ధన్యులగు చున్నారు. నీవు నీ శక్తియుక్తులను, ధర్మమును గ్రహింపుము. నీలో నెచ్చటనో ప్రపంచ మెదురుచూచు గుణమొకటి కల దనుకొంటిమికదా! దానిని త్రవ్వి పైకితీయుము. దానిద్వారా యభివృద్ధిచెందుచు ధనవంతుడవుకమ్ము. ఆ గుణమే నీధనము. అది యితరుల కెట్లు ప్రాప్తించగలదు? సరిగా నిన్నుపోలినవా డింకొకడేడి? ప్రపంచము వ్యక్తిత్వమునే హెచ్చుగ గౌరవించును. ఉపజ్ఞకే యెక్కువ మూల్యము నిచ్చును. అందులోనే సరియైన కళయున్నది.

నీ జీవితవిశేషములోగల కళను నీవు ప్రపంచమున కర్పించి నపు డది నీకు ఋణపడకతప్పదు. ప్రకృతి – దీనికి నీ యిష్టము వచ్చినపేరు పెట్టుకొనుము – నీ ఋణము నుంచుకొనదు. నీ విచ్చినపుడె నీకది యిచ్చును.

"ప్రజలను యజ్ఞములతో సృష్టించి ప్రజాపతి పని ద్వారా మీరు వృద్ధిపొందుడు; ఇవి మీయిష్టములను కురిపించును." అని శాసించెను. దీనియర్థమేమి? నీ పని నీతోడనే పుట్టుచున్నది. దానిని తెలిసికొని దానిద్వారా నీ వభివృద్ధి చెందుటయే నీ ధర్మము. దానిని నీవే చేయగలవు. ఇతరులు చేయజాలనిపనియే నీ కెక్కువ ధనమును చేకూర్పగలదు. ఇదియే శ్రేయోమార్గము. ఈ పద్ధతివలన ధనము, మనము కూడ లభించుచున్నవి. ఇక్కడ పోటీయనుదానికి స్థానములేదు.

డబ్బుకొరకేపనియైనను చేయుట మానవలక్షణము కాదు. మానవుడు డబ్బు నార్జింపగలడు. సృష్టింపగలడు. కోటి రూపాయిలను వెచ్చించియైన నొకమానవుని సృజింపగలమా?

అది యసంభవము. మానవత్వమనునది డబ్బుతో పుట్టి డబ్బుతో చచ్చువానికి చేకూరజాలదు. మానవత్వముకొరకు డబ్బును పోగొట్టుకొనవచ్చును. కాని డబ్బుకొరకు మానవత్వమును పోగొట్టుకొనువాడు డబ్బుపిచ్చతోనే చనిపోవును. వానిచావుముందు యినుపపెట్టెలు బ్యాంకునోటులు ప్రత్యక్షమగును. కాని తనతో చిల్లిగవ్వను తర్లించుకొనిపోయిన మానవు డింతవరకు పుట్టలేదే!

ఒకడు చనిపోవుచు నమితబాధపడుచుండెను. ప్రాణము త్వరగా పోకుండెను. అప్పు డతడు భార్యాబిడ్డలనుపిలిచి "ఒరే నా ప్రాణములు నన్ను విడిచిపెట్టుటలేదు. బాధ సహింపజాలకున్నాను. ప్రాణమే నేడు నాకు భారముగానున్నది. ఇన్ని వెండిరూపాయిలు తెచ్చి నా రొమ్ముమీద పోయుడు. రూపాయలను చూచినగాని నా ప్రాణములు పోవు." అని చెప్పి భార్యాబిడ్డలను బ్రతిమాలి యట్లు చేయించుకొనిన తరువాతనే ప్రాణములు వీడినాడట. డబ్బుపిచ్చ యిట్టి జీవితమునే ప్రసాదించును. ఇట్టి జీవితమును వరింతువా?

# మనస్సును ఖాళీచేయుట

ఇది యెంత తేలికయో యంత కష్టమైనపని. మనస్సులో బెడద పెంచుకొనినకొలది పెరుగును. తగ్గించినకొలది తగ్గిపోవును. ఎంత పనిచేయుచున్నను బెడదలేకుండ చేసికొనవచ్చును. బెడదపెట్టుకొనకపోవుటనగా పనిచేయక సోమరిగ

నుండుటకాదు. పనిచేయుటకే నీవు వచ్చితివి. ఎంత పనిచేయు చున్నను మనస్సును మాత్రము సుఖముగ నుంచుకొనవచ్చును. ఉంచుకొనుము. పనులభారము ననుభవింపకుము.

నీ వొక యభ్యాసమును సాధనము చేయవలెను. మనస్సును నీ వప్పుడప్పుడు నీ పరిసరములనుంచి, నీ పనులనుంచి వేరుపరచి వాటినిమించిన యతీతస్థితికి తీసికొనిపోయి యచ్చట నిలుపుము. ఒకవిధమగు మానసిక నిర్వ్యాపారస్థితి, నిర్విచారస్థితి యనుభవింపుము. దీనివలన మన మెప్పటికప్పుడే నవ్యతను, నూతనత్వమును పొందుచుందుము. క్రొత్తమనుష్యుల మగుచుందుము. అలసట, భారము అనునవి మృగ్యమగును. ఇట్టిస్థితి కలదా? లేకేమి? కలదు. అదియే నిర్మలస్థితి, నిరామయస్థితి, శరీరమును మరపించుస్థితి. పరమవిశ్రాంతి నొసంగు స్థితి. విషయముల కతీతమగు స్థితి.

కాని పనిచేయకుండ సోమరిగనుండుటయే విశ్రాంతి యని నేడు భావింపబడుట సామాన్యమైనది. ఈరోజులలో 'తక్కువకాలము పని, యెక్కువకాలము విశ్రాంతి' కావలెనని చీటికి మాటికి పనిమానుట, సమ్మెలుచేయుట, యేవియో వినాదములుచేసికొనుచు నాకాశములో కొంత సద్దుచేయుట పరిపాటియైనది.

విశ్రాంతియన నెద్దియో మన మిదివరకే కొంత తెలిసికొంటిమి. చీట్లాట, వింతలకొరకు, వినోదములకొరకు పరుగులిడుట విశ్రాంతి కాజాలదు. వీటిలో నిజమైన విశ్రాంతియే లేదు. ఇవి కాలమును చంపు మార్గములు. నిన్ను కొంచెపరచు విధానములు.

మనస్సును నీ బాధ్యతలు, విధులు, విచారములు-అను చెత్తనుండి కాళీచేయుటయే, డొలకచేయుటయే నిజమైన విశ్రాంతి. మనోజయమే విశ్రాంతి. నీ వెన్నిపనులు మానినను, నీ వెన్నిరోజులు సెలవుపుచ్చుకొనినను, నీ వెన్నిచోట్ల ఊరేగినను నీతోపాటు నీ నిత్య సంసారసాగరమును మోసికొనిపోవు నంతకాల మది యంతయు నిష్ప్రయోజనము. ఈ సమయమునందే జ్ఞాపకమునుదానికి నీవు స్వస్తిచెప్పవలెను. మరపు నారాధింపవలెను. మరచిపోవుటయనునదికూడ ప్రకృతి మనకు ప్రసాదించిన గుణములలో నొక ప్రధానగుణము. చాలమంది తమతోపాటు ప్రతిచోటకు తమగృహచ్ఛిద్రములను, వ్యాపార చిక్కులను, యీతిబాధలను మోసికొనిపోవుచుందురు. ఈ గుదిబండలున్నపు డెచ్చటకో పోనేల? కాశికి పోయినను కాటికిపోయినను నివి నీతో వచ్చుచునేయున్నవి. రైలు, బస్సు, స్టీమరు యెక్కుటతోడనే పనిసంగతి మరచిపొమ్ము. ఇతర బాధలను నీ బుర్రలోనికి రానీకుము. విచారమును దరికి రానీకుము. రాబోవువారమునాటి కష్టములకు చోటీయకుము. నీ రాజకీయములకు, 'వాజకీయము'లకు సెలవిమ్ము. వార్తాపత్రికలున్నవను సంగతియే మరచిపొమ్ము. నేడివి చీడలు. చాలమంది తమ భావినిగురించి దీర్ఘముగ యోచించుచు గతమునకు దుఃఖించుచు రెండువిధముల బాధపడుదురు. నీవు వర్తమానమునందే జీవింపుము, సుఖింపుము. వర్తమాన మొక్కటే నీది. తక్కినవి లేనివే.

నీ బాల్యోత్సాహమును తలచుకొనుము. అప్పుడు నిన్ను గురించి నీకెట్టి తాపత్రయము లేదు. దానిని నీ పితరులపై నుంచి

తివి. ఇప్పుడు మాత్రము నీవేల తాపత్రయపడవలెను? విచార
మావంతయులేనిస్థితి ననుభవింపుము. అదియే సరియైన విశ్రాంతి.
మనస్సులో లేని విశ్రాంతి విశ్రాంతికాదు. ఇట్టి విశ్రాంతి
నొచ్చినకొలది నీ జీవితములో సంభవించు విషాదములను
తరింపగలశక్తి నీకేయలవడును. తెలివియే శక్తియే నీ నిజస్వరూ
పము. విచారములు నిన్నులమటబెట్టు మబ్బులు. కారుచీకట్లు.

# శీలము

"శీలంబున ధర్మంబు వెలయు. ధర్మంబున సత్యంబుదొర
కును.సత్యంబున వృత్తంబు సొప్పడు.వృత్తంబున బలంబువాటిల్లు.
బలంబున నేను గలుగుదుంగావున సమస్తంబునకు మూలంబు
శీలంబని చెప్పి సిరి పురందరుపాలికి ధర్మాదులతోడగూడం
జనియె"నని భారతములో దుర్యోధనునకు బోధింపబడెను.
శీలమురొక్క గొప్పదనము నింకెట్లు వర్ణింపగలము? అదియే
సమస్తమునకు మూలము.

శీలమే మానవుడు. ఏలన నతడు పోయినపుడు శీల
మొక్కటే యతనితో పోవుచున్నది. తక్కిన వేష, భాష
లన్నియు నిచ్చటనే మాయమైపోవుచున్నవి. శీలమునుసాధించు
టెట్లు? అది మంచిదని తెలిసికొనినంతమాత్రముచేత చాలదు.
దానిని సాధించుయుక్తి, సూటిమార్గము,ఆచరణ యుండవలెను.
ఇట్టిమార్గములలో పిల్లలను తయారుచేయవలెను. పిల్లలను
కొట్టి, తిట్టి, రాచిరాసాడుచు, దెప్పుచు బలవంతముగ బండపద్ధ

తులవలన వారిని నీతికోవిదులను చేయజూచుట వెఱ్ఱి. ఇవి మానవుని యమ్మాంతముగ మార్చి వేయజాలవు.

నోటితో చెప్పుటకంటె నాచరణరీత్యా ప్రదర్శించుట సరియైన మార్గము. నూరు ఉపన్యాసములకంటె నొక్క కార్యమే మేలు. సోమరితనము తదితర దురభ్యాసములు నెట్టి యంటువ్యాధులో నట్లే పనిచేయుట, శీలగుణము నలవరచుకొనుట, బలమును, శక్తిని సంపాదించుట యట్టిసాదృశ్యములచేతనే పట్టువడును. వ్యాప్తిచెందును. ఒకసారి దానిలో రుచిదొరికిన తరువాత పని దానంతటదియే చకచక నడచిపోవును. కనుక పిల్లలలో పిల్లలై చల్లగ చేయగలవారు కావలెగాని కొట్టి కోదండముతీయు 'కోదండరాములు' పనికిరారు. మనక్రియలకు భావములకు పొందుకుదుర్చువిధానమే శీలము. మొదట భావములు కలుగవలెను. ఎవనిభావములను వాడు బుద్ధిపూర్వకముగ సృజించుకొని పోషించుకొనవలెను. నీచేత భావింపబడిన భావములు క్రియారూపము దాల్చువరకు నాగవు.

నీ శీలము 'నీ. బజారు'లో దొరుకు వస్తువే కాని దాని నితరులు తయారుచేసి నీకియ్యజాలరు. నీ విధి నీచేతిలోనేయున్నది. అబద్ధములాడువానిని నీతిబోధలచే మాన్పింపగలవా? నిజము చెప్పవలెనను నలవాటు నతడే చేసికొనవలెను. అబద్ధములాడు నలవాటును క్రొత్తయలవాటుతో కొట్టివేయవలెను. మనము అలవాటులచేతనే సమస్తము చేయుచుందుము. నీవుచేసుకొనిన యలవాటులే స్థిరపడి శీలముగా పరిణమించును.

దీనికంతకు ప్రయత్నము కావలెను. నీ ప్రయత్నమున కెవరడ్డురాగలరు? నీవు ప్రయత్నింపకున్న నెవ్వ రేమి చేయగలరు?

నీబుద్ధి నుపయోగింపుము. మంచి చెడ్డలను, ధర్మాధర్మములను వివేచింపగల శక్తి కలవాడే బుద్ధిమంతుడు. కొంపలుకూల్చు తెలివి, యాచరణలేని తెలివి యుండవచ్చును. పేకాట తెలివి, జూదమాడు తెలివి యుండవచ్చును. దీనివలన ప్రయోజన మెవరికి? ఒకరిని పడగొట్టు తెలివి యొక తెలివి గాదు.

మానవునకు బలముకలిగించు సమస్తము-అనగా శరీరమునకు, మనస్సుకు, అర్థమునకు, నీతికి, ఆధ్యాత్మికజీవితమునకు-పుష్టినిచ్చు సమస్తము-శీలసామగ్రి యనబడును. భావ సమృద్ధితో క్రియాసమృద్ధిలేని వాల్ల జీవితము వాసనలేని కాగితపుపువ్వువంటిది. శీలసామగ్రిలేని వస్తుసామగ్రి యెంత పోగు చేసినను లాభములేదు. వస్తుసామగ్రి నీ కంటునదియూ కాదు. నీతో చివరివరకు నుండునదియూ కాదు. సౌరభములేని గులాబి, శీలములేని జీవితము నిరర్థకములు.

# సంకల్పశక్తి

సంకల్పశక్తి చేతనే మానవు డితర ప్రాణికోటికంటె నధికుడగుచున్నాడు. ఇతరప్రాణు లెవ్వియు సంకల్పింపజాలవు. సంకల్పించుశక్తి వాటికిలేదు. 'సంకల్పమాత్రోదిత సిద్ధయస్తే' సంకల్పించినంతమాత్రముచేతనే సిద్ధంపచేసికొనగలరని మానవులను గురించియే చెప్పబడుచున్నది.

ఈ సహజశక్తిని పోగొట్టుకొనుట దుఃఖకరము. ఒక్కొక్కనిగురించి 'యతడు వజ్రసంకల్పుడు. ఉక్కుమనిషి' యని వర్ణించుచుందురు. సర్దారు వల్లభభాయిపటేలు కిట్టి ప్రతీతికలదు. అతడు తలపెట్టినదానిని సాధించెను. మూడునందలయేండ్ల నుండి యింగ్లీషువా రిచ్చట స్థాపించి నిలబెట్టిన సంస్థానాధిపతుల నతడు రెండునత్సరములలో నేకలనుచేసి స్వాధీనపరచుకొన గలిగెను. అతని యాకారమే యతని స్థిరసంకల్పమును వెలి బుచ్చును. చేయవలసినకార్యమును చక్కగా విచారించి యది పూర్తియగువరకు ననన్యశ్రద్ధతో దానిమీాద మనస్సును కేంద్రీకరించినవారే ప్రతిభావంతులగుదురు. విజయవంతు లగుదురు.

"మనమట్టుకు మనకు మనబలము, మన తెలివి, మన యైశ్వర్యము, మనరూపము, కులము యిత్యాదులు బాగుగనే యుండవచ్చును. మన హృదయమున కాహ్లాదమును, జీవించుట కర్హులమేయను తృప్తిని కలిగించవచ్చును. కాని యివియున్నను లేకున్నను ముఖ్యమైన దింకొకటి యుండవలెను. ఈ జీవితములో మనమెంత ప్రయత్నముచేసితిమి? ఎంతపౌరుషము చూపితిమి? అనునదియే జీవితము" అని యొక కవి వర్ణించినాడు. ఈ జీవితములోనికి నీ వనతరింపకపూర్వము తల్లిదండ్రులద్వారా సంక్రమించినవాటి నటుంచి నీ స్వయంప్రజ్ఞవలన సిద్ధింపచేసికొనిన దానినే జడతా వేయనలెను. పెయ్యమ్మలవలె పెద్దలసంపాదనతో కాలక్షేపముచేయుచు నిక్కుట జీవితముకాదు. జీవితమునకు నిండుదనము, తుష్టి, పుష్టి చేకూర్చునది నీ ప్రయత్నమే. అదియే జీవితశోభ, జీవితసంజీవి, జీవితసౌరభము.

జీవితపోరాటములో నొక్కొక్కపుడలసిపోవుట, తూలి పోవుట, దుఃఖములపాలగుట సంభవింపవచ్చును. అప్పుడు నిన్ను లేవనెత్తి, నీ విచారముల నపసయించి నీకు తిరిగి జయము చేకూర్చు దివ్యౌషధమేది? నీ ప్రయత్నమే. "ఇది చూపనివా డుత్సవవిగ్రహమునంటివాడు. అధిక ప్రయత్నపరుడు వీరుడు."

జీవితాంతమున నిన్ను కొలుచు కొలబద్దయేది? నీ ధన కనక వస్తువాహనములా? అత్తవారిచ్చిన యంటుమామిడి తోటలా? భార్యతెచ్చిన బంగారపుముద్దయా? ఇవి కలుగ వచ్చును. లేకపోవచ్చును. మధ్యగా మాయముకావచ్చును. నీవు ప్రదర్శించిన పౌరుషము, నీవు సాధించిన యిచ్ఛాశక్తి, నీవుచూపిన కార్యదక్షత నీతోనుండు నిజధనములు. నీ చేష్టలే నిన్ను తెలుపు దర్పణము. నీ స్వీయసృష్టిచాతుర్యమును ప్రద ర్శించుటకొరకే నీ జీవితమేర్పడినది. అప్పనముగ దఖలుపడిన యాస్తిని కాపలాకాయుచు ప్రాణములను వీడువాడు తన వార సులకుగాని, జాతికిగాని క్రొత్తగా సమర్పించునదేది కలదు? చివరకు నీ యెముకలనుకూడ మిగుల్చుకొనలేనివాడవు నీవేమి మిగుల్చుకొనగలవు?

నీ శీలమే స్మశానానంతరముకూడ నీతోవచ్చు ఆస్తి. ఇదియే మానవబంగారము.

# అభ్యాసము

'అభ్యాసము రెండవ ప్రకృతి' యని చిన్నపుడు మనము చదువుకొంటిమి. అదియే నీ మొదటి ప్రకృతికూడ కాగలదు.

నీసమస్తవిద్యలు నభ్యాసముచేతనే సంప్రాప్తమగుచున్నవి. జంతువుకు పుట్టువుచేత కలుగు జ్ఞానముతో నాఖరు. మానవజీవితములో నభ్యాసమే బలీయమైనది. అభ్యాసములేని జీవితము పశుజీవితమును దాటుటలేదు. జంతువులతో పుట్టి జంతువుల మధ్య పెరుగు నడవిమనుష్యులెట్టి గొప్ప యభ్యాసములను చేసికొనుటలేదు. పుట్టినదిమొదలు సమస్తము నభ్యాసముచేతనే కలుగుచున్నవి. నీవు పడుచు లేచుచు నడకనభ్యసించితివి. అభ్యాసముచేతనే మాటలు నేర్చుకొంటివి. దానిచేతనే వ్రాయుట, చదువుట, నిద్రించుట, పరిశ్రమించుట, కండలుపెంచుట జరుగుచున్నవి. అభ్యాసము సాధింపజాలనిదేదికలదు? పడుకొనుట లేచుటకూడ నభ్యాసవశముననే జరుగుచున్నవి.

నీవు సంకల్పించుకొలే తడవుగ నేకార్యమునేని యభ్యాసముచేతనే సాధింపగలవు. అట్లే సాధింపవలెను. ఏది చేయవలెనో యేది కూడదో నిర్ణయించుకొనినతోడనే కార్యరంగలోనికి దిగుము. అభ్యసింప మొదలుపెట్టుము. అభ్యసించుట కాలస్యమనునదిలేదు. కాలాతీతములేదు. ఇప్పుడైనను ప్రారంభింపుము. నీ దోషములను తీసివేయుటో, గుణములను సంపాదించుటో యభ్యాసముతోనే ప్రారంభింపబడవలెను సంగీత మెట్లు సాధింపబడుచున్నది? ఎంత కోకిలకంఠమైనను సాధనచేయనిదే, నిరంతరాభ్యాసము లేనిదే రాణింపదు.

దస్తూరీ యెట్లు కుదురుచున్నది? నీ కండరముల నెట్లు పెంచగలవు? అభ్యాసముచేతనే. అభ్యాసపాటవమే పాటవము దుర్బలశరీర మభ్యాసముచేతనే వజ్రకాయమగుచున్నది. నీ మనస్సును నీ శరీరావయవములపై నిలిపి యభ్యసింప మొదలు

పెట్టినచో నీవు చూచుచుండగనే నీ కండరములు పెరుగ నారంభించును.

నీ మనస్సునుకూడ నీవిట్లే చూచుచుండగనే శిక్షింప వచ్చును. నీ వొక క్రియలోనికి దిగి సూటిగా దానిని మూడు రోజు లభ్యసింతువేని నాలుగవరోజుకు మనసు దిట్టపడును. స్థిర పడును. కాని నీవేవిషయమును తీసికొనినను వంగి వంగిగా పనిచేసినచో లాభము లేదు. హృదయపూర్వకమైన యత్నము నకు లొంగని దేదియు లేదు. వివరముల నాకళింపుచేసికొని చివర వరకు చూడవలెనను దృఢనిశ్చయమున్నచో చాలును.

'సోమవారమునాడు నీకున్న శ్రద్ధను మంగళవారము కూడ చూపుము.' మాటిమాటికి పార్టీ మార్చువారివలె నిరు వదినాలుగు గంటలలోనే రంగు ఫిరాయింపకుము. పాపము శమించునుగాక! ఉత్కృష్టమైన జీవితసమస్యలను చర్చించుచు పార్టీలసాదృశ్యము తెచ్చుట పాడికాదు.

నీ యభివృద్ధిని నీ వనుభవింపవలెను. ఆహ్వానింపవలెను. మన మనేకసారులు చెప్పుకొనినను పునరుక్తిదోషములేనిది 'నేను రోజురోజు అభివృద్ధిచెందుచున్నాను. చెందగలను. చెంది తీరుదును." అని నీకు నీవు చెప్పుకొనుట. ఇట్లు చెప్పుకొనవలెను. ఆత్మబోధకుమించిన యుపాయము, మిత్రము వేరొకటి లేదు. తనను విడిచి యితరులకు బోధింపజూచుట తనను లెక్కించు కొనుట మరచిపోయి తప్పిపోయినవానికొరకు దుఃఖించువాని కథవంటిది.

నీ వెంతటిపనినైనను చేయుటకు ప్రారంభింపగానే నీవను కొనినదానికంటె ముందుగనే ముగియవచ్చును. చేదుకూడ తినుట ప్రారంభముకాగానే తీపిగ మారిపోవుచున్నది.

స్వభావమును మార్చుట చాల కష్టమే కావచ్చును. కాని యభ్యాసము వస్తువులస్వభావమునే మార్చివేయగలదు. చీకటిలో నడచుటకు ప్రారంభించి పదియడుగులు ముందుకు వేయుటతోడనే చీకటి మారిపోవుచున్నది. నీకు కోపము కలిగి నప్పుడెల్ల పదినిమిషము లూరకొందువేని నీకోపమే మారిపోవును దానంతటది చల్లారిపోవును. నీ కోపమునకుగల కారణ మొక కారణమే కాకపోవచ్చును. కారణమేదైనను నీవు కోపించుట నిష్ప్రయోజనమని తెలిపోవును. లేదా కోపముమీదనే కోప గించినచో నదేమగునో చూడుము. అభ్యాసము సమస్తమును సాధువుచేయగలదు. అభ్యాసయోగము గొప్పయోగము.

# నీ ప్రత్యక్ష సమస్య

'మనస్సును కేంద్రీకరింపుము. ఇచ్ఛను శిక్షింపుము. శ్రద్ధవహింపుము. ఆత్మవిశ్వాసము కలిగియుండుము' అని మాటి మాటికి కంటికి కనిపించని యనేక 'గాలివిషయములను' గురిం చియే చెప్పుచుండుట విసుగుగతోచవచ్చును. ఇవి చేతికి దొరకు నవికావు, కాలికి తగులునవికావు, కంటికి కన్పించునవికావు, కనుక నవాస్తవికములు, ప్రయోజనరహితమైనవి యనుభావ ముండవచ్చును.

కనుక మనము కొన్ని ప్రత్యక్షసమస్యలను తీసికొనుట మంచిది. నిత్యము మన మనేక సమస్యల నెదుర్కొనవలసి యున్నది. సమస్యలతో కూడుకొనిక దేజీవితము. పొగత్రాగుట, పొడుముపీల్చుట, రాత్రి పన్నెండుగంటలవరకు నిద్రింపకుండుట, యెనిమిదిగంటలవరకు లేవకపోవుట, పట్టకూడని స్నేహముపట్టుట, చేయకూడని ఖర్చుచేయుట, రాబడినిమించి ఖర్చుచేయుట, చాడీలుచెప్పుట, దొంగతనము మొదలగు చిలిపి పనులుచేయుట - ఇట్లెన్నియో సమస్యలు కలవు. వీటిలో నీకు సంబంధించిన యొకటి రెంటిని తీసికొని వాటినివారణకు నీ శక్తి యుక్తుల నుపయోగింపుము. నీ బండారమంతయు నిచ్చటనే బయల్పడగలదు. నీ యభివృద్ధి లేక మానవాభివృద్ధి యనగా నిట్టివే యనేకములగు దుర్గుణముల నొక్కొకటిగ గెలిచి దోషరహితుడవై పవిత్రజీవితమును గడుపుటయే. నీ జయమో. యపజయమో, నీ గట్టితనమో దుర్బలత్వమో, నీ పౌరుషమో, స్తబ్దత్వమో బయల్పడుట కివియే సరియైన రంగ స్థలములు. ఇట్టి గుణసంపదలేని పదార్థసంపద దురర్థకము.

ఒక యవగుణమును పోగొట్టుకొనుట కొక మంచి గుణము నలవరచుకొనుము. 'నేను పెందలకడనే లేవవలెను. మంచి కావ్యము నేదేని పఠింపవలెను. పేకాట, బ్రాకెట్, జూదము మొదలగునవి మానవలెను.' అని కృతనిశ్చయము. చేసికొనవలెను. ఈ పనులకు కచ్చితముగ పూనుకొనవలెను

చేయకూడనిపని చేయకుండుట చాలదు. నీవు చేయ వలసినపని చేయగలుగుటయే గొప్పవిషయము. ఇది మాట లలో తేడాయని రెంటికిని భేదమంతగాలేదని యనుకొందుము.

చెడుగును వ్యతిరేకించుశక్తి మనకవసరమే. మంచిచేయు శక్తిలో సృజనశక్తికలదు. ఇదియే జీవితమునకు జీవిక. ఈ రెండువిధముల పోరాటములద్వారా నీ యిచ్ఛాశక్తి యినుమడించును.

శ్లో॥ అశుభేషు సమావిష్టం శుభేష్వే వావతారయేత్ ।
స్వమనః పురుషార్థేన బలేన బలినాంవర॥

జీవితము, మనస్సు శుభాశుభవిషయములతో కూడుకొనియున్నది. అశుభమార్గములలో ప్రవేశించు జీవితమును, మనస్సును శుభమార్గములో బలవంతముగా ప్రవేశపెట్టుటయే యుత్తమపురుషార్థము.

# దురభిమానము

చకచక పరుగెత్తుచుండు రైలు హఠాత్తుగ నాగిపోవును. వందలకొలదిబస్తాలను దింపుచుండు బియ్యపుమర, వేళ్లకొలది వస్త్రములను దిగుమతిచేయు నేతయంత్రము చటాలున స్తంభించిపోవును. ఈ యంత్రములకేదియో దోషముకలిగినట్లు గ్రహించి వెంటనే పనివానిని పిలిచి బాగుచేయింతుము. మన మానసిక యంత్రములలో సంభవించు దోషములను నివారించుటకుకూడ నీపాటి యింగితమును ప్రదర్శింపవలదా? ఈ యంత్రము పైకి కన్పించు స్థూలయంత్రముకంటె నతిసున్నితమైనది. దీని నితరులు నడుపజాలరు. దీనిని నడుపువాడు దీనిలోనే కలడు. ఇచ్చట పరహస్త మనవసరములేదు;పనికిరాదు. ఇందులో ప్రవేశించు దోషములును నీకు తెలియకుండగనే జేరుచుండును. ఏ రభసలేకుండ

పాటూపాటిగ పనిచేసికొనుచు జీరున చీదకుండనూరేండ్లు నిర్విచారముగ నానందముగ జీవింపవలసిన మానవయంత్రము నేడెంత తికమక చెందుచున్నది? ఎన్ని మనోరోగములు? నేడు రోగములేనిమనిషి మందుకైన కాన్పించుచున్నాడా?

దురభిమానము మొదటిదోషము. మనదోషముల నొప్పుకొనము. ఇతరులలోనున్న దోషములనే చూపుచుం దుము. ఇది దురభిమానము. మన మానసికయంత్రమునకు సంభవించుచుండు దుర్దోషము. దీనిచే సృష్టిక్రమమే తప్పి పోవుచు మానవుడు తల్లక్రిందులైపోవుచున్నాడు. అతనికి ప్రపంచమంతయు వ్యతిరేకమైనట్లు తోచుచుండును. తన మాన సికయంత్రమునకే దోషముపట్టినదని దుమ్ముదూరినదని గ్రహిం పడు. దానిని బాగుచేసికొనవలెనని యంతకంటె భావింపడు. చెంబు, గిన్నె, గడియారము పాడైనపుడు బాగుచేయించు కొను తాపత్రయములో నూరవవంతైనను దీనికుండిన తాను బాగుపడెడివాడు. ఇతరులలో దోషమున్నను నీకేమినష్టము?

నీ యజ్ఞానము, దురభిమానము, సోమరితనము నిన్ను బాధించును. లేదా యివియన్నియు నితరులలోనున్నను నిన్ను నీవు మొదట దిద్దుకొనినచో వారు నిన్నేమిచేయగలరు? ఈపని మొదట నీవు చేసినతరువాత నీవు చేయుపనులు రాణిం చును. ఇది చేయక నీవెంత 'లోకమరమ్మతు' పనులుచేసినను లాభములేదు. సూర్యునిచుట్టు తక్కినగ్రహములు తిరుగుట లేదా ?

ముందు నిన్నునీవు తరచు పరీక్షించుకొనుచుండుము. ఇదియొక సిద్ధౌషధము. రసవిషగంధకాదులు కలియని దివ్యౌ

షధము. అంధకారమును, దుఃఖమును పోగొట్టి వెలుతురును, సుఖమునుచేకూర్చు పరమౌషధము. నీ యార్థిక, రాజకీయ, నైతిక పరిస్థితులలో నీలో నిజమైనమార్పుతెప్పించి నిన్ను సుఖించునట్లుచేయుశక్తి. దురభిమానము నీకు తెలియకుండగనే ప్రవేశించును. నేనే గొప్పవాడననుకొన్నను దురభిమానమే! ఇది నీకున్నదో లేదో యెప్పుడైనను పరీక్షించుకొంటివా? ప్రపంచమును 'నల్లద్దములతో' చూచుచుందుము. తప్పు మన దైనను నంగీకరింపము. తప్పుచేయనివా డీ ప్రపంచమునకలడా?

బలవంతుడు, మేధావంతుడు, ఇంగితమునెరిగినవాడు తనతప్పు నొప్పుకొనుటకు జంకడు. మహాత్ముడే మనకు తార్కాణము. అతడట్లంగీకరించినకొలది బలవంతుడయ్యెను. ఆతని యాత్మగౌరవ మాత్మవంచన కెంతమాత్రము నెడమీయలేదు. ఇతరులయెడలకూడ నతని కపరిమితగౌరవము. తనలోపము నతడు పైవారికెన్నడు నాపాదించియెరుగడు.

ఈసారి ప్రపంచము 'నలుపెక్కినపుడు' నీ దోషమేమైన కలదేమొ చూచుకొనుము. ప్రపంచమును నల్లగాచూచుటయే దోషము. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇదియంతయు బ్రహ్మమే. ఇక నలుపెక్కడనుంచి వచ్చినది? దీపముముందు చీకటి పలా యనమగునట్లు నీ మనస్సులో సదా వెలుతురే ప్రకాశించు నపుడు నిన్నే దయ్యములు బాధింపనేరవు.

సత్యమే, సత్త్వమే, బలమే, తేజమే నీవు. తక్కిన గుణములన్నియు నీవు తెచ్చిపెట్టుకొనిన అరువుసరుకు. అరువు సొమ్ము బరువుచేటు. అవి నిన్ను కృంగదీయు వికారగుణములు.

13]

# యుద్ధరంగము

ఈ జీవిత మొక యుద్ధరంగము. ఈ రంగములో ప్రతి వాడును యోధుడు. మనమందరము కొన్ని పరిస్థితులమధ్య పుట్టుచున్నాము. నీ పరిస్థితులు నీతో పుట్టి నీతోనే సమాప్తి చెందును. నీ వున్నంతకాల మవి యుండకతప్పదు. వీటిని జయించుటయే నీ పని. వీటిని జయించినవాడే యోధుడు.

నీ వొక్కసూత్రమును ముమ్మాటికి నమ్మవలెను. నీవు జయించలేని పరిస్థితులెన్నడు కలుగనేరవు. నిన్ను మించిన పరిస్థితులు లేనేలేవు. అవి నీ సేవకొరకేర్పడినవి కాని, నీవు వాటి కొరకేర్పడలేదు. వాటికి లొంగిపోవుట మానవలక్షణము కాదు. కొన్ని పరిస్థితులమధ్య నీ వుండక తప్పదు. కనుక వాటిని నీ జీవిత సోపానములుగ చేసికొనుము. వాటిని నీ వవలీలగా తరించి నిచ్చెనమెట్లనెక్కినట్లు వాటిపై నెక్కి పోవుము. నీవు ధనవంతుడ వగుదువుగాక, దరిద్రుడవగుదువుగాక! ఎవనికైన నిదియే మార్గము. మానవునకు కావలసినదేది? నితాంతారోగ్యము. సర్వసమగ్రమైన కార్యదక్షత. ఈ రెండును సాధింపబడినపుడు జీవితము సర్వసౌఖ్యముగనుండును. సుందరముగను శోభాయ మానముగను నుండును. వీటిని నీ నిత్యజీవితకార్యరంగములో సాధింపవలయు నేకాని కాఫీహోటళ్లలోను, శాసనసభలలోను, పదవులవేటలోను సాధింపజాలవు. ప్రస్తుత పాఠశాల, కళాశాల తంతులును నిందుకుజాలవు. పనికిరావు. ఈ చదువులు జీవిత

మర్మముజోలికి పోలేని యాంత్రికవిధానములు. చివరకు నేడివి పీపుపగులగొట్టు విమానమోతలక్రింద, నిత్య సమ్మెలక్రింద నలుగుచున్నవి. ఇంతవరకు మీకీ వ్యాసములలో కొన్ని సూచనలు, సలహాలు, మిత్రవాక్యములు తెలుపబడినవి. ఇప్పుడు మరొక్కమాట కలదు.

'రోమునగర మొక్కదినములో నిర్మింపబడలేదు.' అను సామెత కలదు. అట్లే నీ జీవితాశయములన్నియు కొద్దిరోజుల లోనే యీడేరవలెననుకొని యాపేక్షపడకుము. సంవత్సరములు పట్టినను పట్టనిమ్ము - జీవితము గారడీవిద్య కాదు. అది యణు వణువు, కణము కణముచొప్పున వృద్ధిచెందవలెను. పదిరోజులు లేక కొద్దినెలలు చేసినంతమాత్రముచేత నీ వనుకొనినంత జయము చేకూరకపోయినను నిరుత్సాహపడకుము.

అభివృద్ధియన నూటికి నూరుపాళ్లు పాతయలవాటులను, చెడ్డయలవాటులను పోగొట్టుకొని క్రొత్తయలవాటులను, మంచియలవాటులను నలవర్చుకొనుటయే యని మనకు విదిత మైనది. కాని యిది మాటలుచెప్పినంత సుళువైనపనియా? చంచలము, దుర్బలమునైన మనస్సును బలవంతముగ కేవలము నీ వాచికనిశ్చయముచేతనే, యిచ్ఛాశక్తిచేతనే మార్చివేయ జాలవు. సంవత్సరములనుండి పాతుకొనిపోయిన సందేహము లను, గడ్డకట్టుకొనిపోయిన కుసంస్కారములను నిర్మూ లించుట కెల్లతెరబడి ప్రయత్నముండవలెను. సంతతప్రయ త్నములేనిదే యిది నెరవేరజాలదు.

నీకు వ్యతిరేకముగ పనిచేయు శక్తుల బలాబలములను నీవు మొదట గుర్తింపవలెను. వాటినిమించిన బలవత్తరప్రయ

త్నములను చేయవలెను. ఇట్లు మాసములు సంవత్సరములు కరి మకరియుద్ధము జరిగినతరువాత నీలో కొంత యభివృద్ధి పొడగట్టును. అదియేచాలును. ఆత్మవిజయము పర్వతారోహణమువంటిది. అడుగడుగుకు నీవు పోరుచునేయుండవలెను. కాని 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్' ఈ ధర్మము నేపాటి సాధించినను నది నిన్ను గొప్పభయమునుండి రక్షింపగలదు అని గీత నీ కభయహస్తమిచ్చుచున్నది. అభ్యాసము, ఓర్పు, పట్టుదల, విశ్వాసము – దీనికిం కావలసిన వస్తుసామగ్రి. నీవుచేపట్టిన ధర్మమునందు, కార్యములందు పూర్ణ విశ్వాసము, అంతిమవిజయము నీదే యను ధీమా యెన్నడును వీడరాదు. ఎంత యిరువదియవశతాబ్దమైనను, 'తర్కము' 'శాస్త్రములు' అనువానినే నమ్మకమైనను విశ్వాస మమోఘకార్యములను, అద్భుతశక్తిని ప్రదర్శింపగలదని మనకు విదితమైనది. దీనికి మహాత్ముని జీవితమే తార్కాణము. అతనికంటె మణుగులకొలది యధిక తెలివితేటలు, పాండిత్యము, భాషాప్రకర్ష కలవారెందరో కలరు. కాని యతనికున్న యాత్మవిశ్వాసములో నావంతయు వారికి లేదు. విశ్వాసము కొండలను కదలింపకలదు. నదులను స్తంభింపచేయగలదు. ప్రకృతిని జయింపకలదు. నిన్నెంతవానినైనను చేయగలదు. మహాత్ముని మహాత్త్వకు విశ్వాసమే కారణము.

నేటి భౌతికశాస్త్రములు, నితర చిల్లరశాస్త్రములు దీనిని గ్రహింపజాలకపోయినచో నది వాటితప్పు, వాటి యసమర్థత. అవి యింకను వృద్ధిచెందవలెను.

జీవితము పదార్థమయముకాదని, జడమయముకాదని, దానికే పరిధులులేవని, దానిని నిర్వచింపజాలకపోయినను అనుభవింపవచ్చునని, దానిమహిమ ప్రదర్శింపబడినదని మన కీపాటికి తెలిసినది. కళ్ళకుకట్టినట్లు ఋజువుచేయబడినది. మహాత్ముల చేతను ఋషులచేతను నీ కండ్లయెదుటనే సాధింపబడినది.

అనుభవమే జీవితమును పెంచును. అనుభవముకొరకే జీవితము కలుగుచున్నది. అనుభవముతోనే యది పరమార్థమును సాధించుచున్నది.

జీవితరంగములో నీకు నియమింపబడిన స్థానమును, లేదా నీకు నీవే నియమించుకొనిన స్థానమును నీ వశముచేసికొని నీ పదునారణాల శక్తిని, నీ ప్రతినిమిషమును నీ నిజాభివృద్ధికొరకు వినియోగింపుము.

ఈ యుద్ధములో జయమే పరమావధి. శత్రువు నోడించుటయే నీ పని. దుర్బలత్వమే నీ శత్రువు. జయించుటకే నీవు పుట్టితివి.

## నైతికసౌందర్యము

హిమాలయపర్వతరాజ మాశ్చర్యమును కలిగించును. తాజమహాల్ మనలను ముగ్ధులను జేయును. సముద్రదర్శనముచే మనము విభ్రాంతులమగుదుము. కాని సృష్ట్యాదినుండి ప్రభవించుచు మహత్తర కీర్తి నార్జించిన స్త్రీ పురుషుల దివ్యచరితల వెనుకనున్న నైతికసౌందర్యమును మనము దేనితో పోల్చగలము? దాని కదియే సాటి.

పైవి ప్రకృతి సౌందర్యములు. అవి మనశ్చక్షువుకు కాన్పించుచును. వాటిగుణములను మనము మన పంచేంద్రియశక్తుల ద్వారా యనుభవింతుము. నైతిక సౌందర్యము పైకి గోచరించువస్తువు కాదు. కాని యంతకంటె సత్యమైనది, పటుతరమైనది, నిత్యమైనది యేది కలదు? అది యాశ్చర్యములలో నాశ్చర్యమైనశక్తి. అందరకు నందుబాటులోనున్నశక్తి. అందరకు బలమిచ్చుశక్తి. అది జీవిత చింతామణి.

మానవునిలోనే వ్యక్తమగుచుండు నీ శక్తి యెచ్చట పుట్టుచున్నది? దీనికి మూలమెద్ది? దీని తావెచ్చట కలదు? ఇది నీలోనున్నదికదా! దీనిచోటు దొరకునా?

శరీరమును శస్త్రములతో కోసి చూడుము. మెదడు పదార్థమును సూక్ష్మముగ ఛేదించి చూడుము. నాడులు, నరములు, ప్రేగులు, రక్తవాహినులు, శిరలు, ధమనికలు భూతద్దముతో పరీక్షింపబడవచ్చును. శరీరములోని ప్రతి రసాయనిక చర్యను కనిపెట్టవచ్చును. ఎంతటి పరీక్షనైనను చేసి రక్తము మొదలగు సప్తధాతువులను శోధింపుము. ఈ యన్నిపరీక్షలకు నందని యవ్యక్తబలము, స్థైర్యము, సౌందర్యము, నైతికవిలువ యొకటి కలదు.

శరీరములోని ప్రతి యవయవమునకు నేదో యొక పేరు పెట్టి మన చేతనైనట్లు మనము నడువవచ్చును. ఒక్కొక్కదాని కొక్కొక్క ధర్మమున్నట్లుకూడ కనుగొనవచ్చును. కాని యీ మానవయంత్రము వెనుకనున్న యథార్థము, అసలు రహస్యము తెరమరుగుననే జరుగుచున్నది. మృత్యువు ప్రత్యక్ష

నైనను దానిని ధిక్కరించి నిలిపివేయగల ధైర్యము, ఆత్మ విశ్వాసము మనలో కన్పించుటలేదా? కొంతమంది దీనిని విశ్వాసమందురు. కొంతమంది యంతరాత్మయని, శక్తియని, వెలుగని, సత్యమని, దైవమని చెప్పుదురు. దీనికి కొంతమంది యాశ్చర్యపడి యాశ్చర్యముగ చెప్పుకొనుచు వినుచూ దీనిని తెలిసికొనజాలకుందురని గీత చెప్పుచున్నది. చివరకు ప్రతివాడు మనమందరము నీ యన్వేషణలో కొంతవరకే పోవుచు నిక ముందుకు పోజాలక మనకు తోచిన సమాధానములను చెప్పు కొందుము. ఇవన్నియు నొకమోస్తరు సమాధానములే కాని యసలు విషయము కావు. కానేరవు. నీ జీవితములో నీ వెప్పుడో యొకప్పుడు దీని నెదుర్కొనక తప్పదు.

ఈశక్తిని తెలిసికొని యనుభవించుటకే మానవత్వ మాసించుచున్నది. అన్ని యైశ్వర్యములు కలిగినను, నెంత యర్థబల యంగబల మున్నను, నెంత శరీరారోగ్యమున్నను దీనిని తెలిసికొననిదే జీవితము పూర్తియగుటలేదు. ఈ యను భవము తక్కిన యనుభవములన్నిటికంటె మహోన్నతమైనది.

మానవయంత్రమువలననే యనేక యైశ్వర్యములు, శాస్త్రములు, వస్తుసంపద, భోగములు, రాజనీతులు, తంత్ర ములు పుట్టినవి. ఇంకను పుట్టుచున్నవి. కాని యివి యన్నియు నైతికబలముముందర నైతికసౌందర్యముముందర వెలవెలబోవు చున్నవి. నిర్వీర్యమగుచున్నవి. అట్టిశక్తి సంపాదించిన మహా త్ములముందు రాజులు, రాణులు, సామ్రాజ్యాధికారములు పలాయనమగుచున్నవి. అట్టివారిముందు తదితర చిల్లర శాస్త్రములన్నియు నోరెత్తజాలకయున్నవి.

మహాత్ముని నైతికశక్తిముందు, సౌందర్యముముందు ప్రపంచమే దిగ్భ్రమచెందెను. ప్రపంచ మతని శాసనముకొరకే ఎదురుచూచెను. అతనిగాథలనే నిరంతరము చెప్పుకొను చుండెడిది. ఆంగ్లసామ్రాజ్యాధినేతలు డిల్లపోయిరి. నలుబది కోట్లనుండి ప్రజల నది ముగ్ధులనుచేసెను.

నేటి యంత్రశక్తివలన ప్రపంచము మున్నెన్నడు నెరుగ నంతటి యైశ్వర్యము చేకూరెను. భోగపదార్థజాలము, వస్తు సంపద కుప్పకుప్పలుగా పెరిగెను. అయినను నేడు ప్రపంచ ములో శాంతి కలదా? జాతులు స్థైర్యమునొంది సుఖముగ జీవింపగలుగుచున్నవా? లేదు. కారణము? ద్రవ్యలోపమా? శాస్త్రములకొరవా? పదార్థలోపమా? యంత్రములు కొరవా? ఏ దేవుడడ్డుపడినాడు? నేడు మానవత్వమే, నైతిక స్థైర్యమే, నైతికసౌందర్యమే లోపించినది. అది వృద్ధిచెంద నంతకాలము ప్రపంచము సుఖింపజాలదు. పాముకోళ్ళు, ఫల రసము నందించు చెమ్బ్చా, భగవద్గీత, 'నాలుగుపరకలపిలక' తప్ప మరెట్టి యైశ్వర్యము నెరుగని మహాత్ముని నైతికశక్తి, సౌందర్యమువంటి సంపదయే యెప్పటికైనను ప్రపంచము నుద్ధ రింపగల దివ్యశక్తి. తక్కిన యణుశక్తులు, హైడ్రోజనుశక్తులు నిన్ను యమమందిరాతిథ్యమునకు శీఘ్రముగ తీసికొనిపోగల యభినవయుగ వరప్రసాదములు.

సమాప్తము.



భావప్రపంచము – అనగా శివము, సుందరము, సత్యము, సుఖము, కళ్యాణము, సౌందర్యము, ప్రేమ – యిత్యాది గుణములకంటె శరీరావయవములు, అస్థిపంజరము, రక్తమాంసములు, జంతుక్రియలు నేడు యెక్కువ వాస్తవికములు, సహజములు నయినవి. ఇనుము, వెండి, బంగారములు కౌగలించుకొనబడుచున్నవి.

భౌతికశాస్త్రము జయించుటకును, మానవత్వము పతనమగుటకును ఈ ప్రమాదమే కారణము. నేటి నాగరికత యీ భయంకరమార్గము నవలంబించి చిందులుత్రొక్కుచున్నది.



మానవయంత్రములో నీ కొలతకు నీ తూకమునకు నీ చేతికి చిక్కు వస్తువులకంటె నీ కంటికి, నీ మానములకు ద్వార కనివస్తువులే యెక్కువ ప్రధానములని గుర్తింపుము.

నీ రక్తధాతువులోని ద్రవ్య, రాసాయనికాది వస్తుసమత. యెంత ముఖ్యమో నీ భావనాశక్తి కూడ నీ శరీరపాటవమున కంత యవసరమైనది. అంతకంటె ముఖ్యమైనది.



నీవు చనిపోవునపుడు నిన్ను నలుగురు మోయవలసి వచ్చుచున్నది. జీవించి యుండగా నీ 160 పౌనుల శరీరము నవలీలగా కొండలనక, మిట్టలనక నదులనక, నేరులనక దాటించిన దెవరు ?

ఈ నీ శక్తిని గురించి నీవు తలపోయనక్కరలేదా ? దీనిని నీవు తెలిసికొననక్కరలేదా? అట్లు తెలిసికొనని దోషము, నష్టము యెవరిది? ఈ నష్టపడున దెవరు ?

